# ఇస్లాం
## రాజకీయ సిద్ధాంతం



మూలం :
మౌలానా మౌదూది

అనువాదం :
ఎస్. ఎమ్. మలిక్




తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్
లక్కడ్ కోట్, ఛత్తా బజార్,
హైదరాబాద్ - 500 002




# ఇస్లాం
# రాజకీయ సిద్ధాంతం





తెలుగు
ఇస్లామిక్
పబ్లికేషన్స్

# ఇస్లాం

## రాజకీయ సిద్ధాంతం



మూలం :
మౌలానా మౌదూది

అనువాదం :
ఎస్. ఎమ్. మలిక్




తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్
లక్కడ్ కోట్, ఛత్తా బజార్,
హైదరాబాద్ - 500 002

ప్రథమ ముద్రణ : మే, 1987
ప్రతులు : 2000



వెల : రు. 3-40

ప్రకాశకులు :
తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్
లక్కడ్‌కోట్, ఛత్తాబజార్,
హైదరాబాద్ – 500 002

ముద్రణ :
కాస్మిక్ ప్రింటర్స్
లక్కడ్‌కోట్, ఛత్తాబజార్,
హైదరాబాద్-500 002.

బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీమ్



"ఈ వ్యాసం ప్రఖ్యాత ఇస్లామీయ తత్వ వేత్త మౌలానా సయ్యిద్ అబుల్ ఆలా మౌదూది 1939, అక్టోబర్ నెలలో వ్రాశారు. ఉదాహరణగా ఉటంకించిన పలు విషయాలు ఆనాటికి సంబంధించినవే అయినా సూత్ర ప్రాయంగా అవి నేటికీ వర్తిస్తాయి. ఇస్లామ్ ప్రతిపాదించే రాజకీయ సిద్ధాంతాల అవగాహ నకు ఈ చిరు పుస్తకం ఎంతో దోహదపడ గలదని ఆశిస్తున్నాము". —ప్రకాశకులు

ఇస్లామ్‌ను గురించి ఇదొక "ప్రజాస్వామిక వ్యవస్థ" అన్న మాట, తరచుగా మీరు వింటూనే ఉంటారు. గత శతాబ్ది చివరి నుండి ఈ మాటను మాటిమాటికీ రెట్టిస్తూ ఉన్నారు. కాని ఈ మాటను పలికేవారిలో ధర్మాన్ని బాగా అధ్యయనం చేసినవారు, ఇస్లామ్‌లో ప్రజాస్వామ్యం ఏ స్థానంలో ఉందో ఏ యాపంలో ఉందో అర్థం చేసుకోవడానికి కృషిచేసినవారు వెయ్యి మందిలో ఒక్కరు కూడా లేరని నా గట్టి నమ్మకం.

వీరిలో కొందరు ఇస్లామీయ సామూహిక వ్యవస్థలోని కొన్ని బాహ్య రూపాలను చూచి దాన్ని ప్రజాస్వామ్యం అనే

పేరు అంటగడుతున్నారు. చాలా మంది బుద్ధి విచిత్రమైంది. ప్రపంచంలో, ముఖ్యంగా వారి పరిపాలకుల్లో ఏదయితే సర్వ సమ్మతమయిన విషయమో దాన్ని ఏ విధంగానయినా ఇస్లామ్‌లోనూ ఉన్నట్లు ఋజువు చెయ్యాలని ప్రయత్నిస్తున్నారు. ఇలా చెయ్యడమే ఇస్లామ్ సేవ అని, ఎంతో గొప్ప సేవ అని కూడా వారు భావిస్తున్నారు. ఇస్లామ్ ఓ అనాధ బాలుడని, ఎవరయినా పలుకుబడి ఉన్నవారి సంరక్షణలేనిదే అతన్ని సర్వనాశనం నుండి తప్పించడం సాధ్యపడదని వారు భావిస్తున్నారేమో! లేక మన గౌరవ ప్రతిష్ఠలు కేవలం ముస్లిములుగా ఉండటం మూలాన ఇనుమడించవని, గౌరవ ప్రతిష్టలు ప్రాప్తం కావాలంటే, మన పద్ధతుల్లోనూ ప్రపంచాన చెలామణిలో ఉన్న ఏదో ఒక దృక్పథం రూపురేఖలున్నట్లు ప్రకటించడం వల్లనే అది సాధ్యమని వారి అభిప్రాయమేమో!

ఈ బుద్ధి కారణంగానే ఒకప్పుడు, కమ్యూనిజం ప్రచార ప్రభంజనం మహా జోరుగా సాగే రోజుల్లో ముస్లిముల్లో కొందరు "ఇది కేవలం ఇస్లామ్‌కు ఓ కొత్త రూపమే" అని ఎలుగెత్తి చాటసాగారు. ఆ తరువాత నియంతృత్వం విజృంభించగానే కొందరు ఎగిరి గంతేసి "అమీర్ విధేయత" పట్ల గొంతులు చించుకుని, ఇక్కడ (ఇస్లామ్‌లో) వ్యవస్థ అంతా నియంతృత్వం ఆధారంగానే నెలకొన్నది అని చాటారు.

ఇంతకు ఇస్లామీయ రాజకీయ వ్యవస్థ నేడు ఓ చిక్కు ప్రశ్నగా తయారయింది. అనేక కలగూర గంపలా రూపొందింది. ఇందులో నుండి బజారులో లభించే దేన్నయినా తీసి

-చూపగలగడం సాధ్యమయిపోయింది! అయితే సశాస్త్రీయంగా పరిశోధించి వాస్తవానికి ఇస్లామ్ సూచించే రాజకీయ సిద్ధాంతం ఏదో తెలుసుకోవడం ఎంతో అవసరం. ఈ విధంగా అన్ని వైపులా వ్యాపించి ఉన్న భిన్న స్వరాలు అంతమవడమేకాక, ఇంకా ఇస్లామ్, ఓ రాజకీయ, సాంస్కృతిక వ్యవస్థ అంటూ చేన్నీ ప్రతిపాదించదు అని చెప్పేవారూ నోళ్ళు మూసుకోవడమే కాక, వాస్తవానికి చీకట్లలో తడబాట్లకు గురవుతున్న ప్రపంచం ఎదుట ఓ వెలుగు రేఖ ఉదయిస్తుంది. ఇది నేడు ఎంతో అవసరం.... ఈ అవసరం పట్ల ఈ ప్రపంచానికి స్ఫురణలేదన్నదీ ఓ వాస్తవమే.

ప్రప్రథమంలో ఒక విషయాన్ని బాగా గుర్తించాలి. ఇస్లామ్ నలువైపుల నుంచి ఎరువుదెచ్చుకున్న కొన్ని భిన్న విభిన్నమయిన ఆలోచనల, ఆచరణల కూర్పు కాదు. ఇది సమగ్రమయిన ఒక వ్యవస్థ. దీని పునాదులు కొన్ని పటిష్ఠమయిన సిద్ధాంతాలపై ఆధారపడి ఉన్నాయి. దీని ముఖ్యాంశాలు మొదలుకొని చిన్న చిన్న ఉప విషయాల వరకు ప్రతిదీ దీని ప్రాతిపదిక సూత్రాలతో సహేతుకమయిన సంబంధం కలిగి ఉంది. మానవ జీవితంలోని వివిధ విభాగాలన్నింటి గురించి ఇది ఏర్పరచిన నియమనిబంధనలన్నింటికీ దీని ప్రాథమిక సూత్రాల ద్వారానే జీవం ప్రాప్తమవుతుంది. ఈ ప్రాథమిక సూత్రాల నుండి ఇస్లామీయ జీవన వ్యవస్థ శాఖోపశాఖలను ఒక వృక్షంలా విస్తరింపజేస్తుంది. విత్తనం నుండి వేర్లు, వేర్ల నుండి మొక్క, దాన్నుండి కొమ్మలు, కొమ్మల నుండి రెమ్మలూ, ఆకులూ పుడుతాయి. పెద్ద వృక్షంగా పెరిగి

పోయినా దాని ప్రతి ఆకు వేర్లతో బలిష్టమయిన సంబంధం కలిగి ఉంటుంది. అందువల్లనే ఇస్లామీయ జీవన వ్యవస్థలో ఏ విభాగాన్ని తెలుసుకోగోరినా దాని వేర్ల వైపుకు మరలడం అనివార్యం. దాన్ని కాదని ఇస్లామ్ నిజ సారాన్ని గ్రహించ గలగడం అసంభవం.

## దైవ ప్రవక్తల ధ్యేయం

ఇస్లామ్, దైవాదేశాలకు లోబడి ఏర్పడే జీవన వ్యవస్థ. ఇది కేవలం అబ్దుల్లాహ్ తనయుడు ముహమ్మద్ (సఅసం) ధ్యేయమే కాదు. మానవ ఇతిహాసంలో అతి పురాతన కాలం నుండి దైవం తరఫున ఆవిర్భవిస్తూ వచ్చిన ప్రవక్తలందరి ధ్యేయమూ ఇదే. సంగ్రహంగా చెప్పాలంటే, ఒకే దేవుని దైవత్వం ప్రజలచేత ఒప్పించడానికీ ఆయన ఆరాధనే అందరి చేత జరిపించడానికీ ఈ ప్రవక్తలందరూ వచ్చారు. అయితే ఈ సంగ్రహ విషయంపై ఉన్న తెరను తొలగించి కాస్త లోతుగా, విపులంగా పరిశీలించడం అవసరం. అంతా ఈ తెరచాటునే దాగివుంది. కాస్త పరిశీలనా దృష్టితో గమనించాలి. ఒకే దేవుని దైవత్వాన్ని ప్రజలచేత ఒప్పించడం అంటే అర్థమేమిటో కేవలం ఆయన ఆరాధననే చేయించడం అంటే దాని ఉద్దేశ్యమేమిటో, ఆలోచించాలి. ఒక వ్యక్తి లేచి "ఆయన తప్ప మీకు మరో దైవం లేదు" అని ప్రకటించగానే అత్యాచార శక్తులన్నీ ఎగబడి ఆతన్ని చుట్టుముట్టడానికి కారణమేమిటో పరిశీలించాలి. ఒకవేళ నేడు అనుకుంటూ ఉన్నట్లు

కేవలం మస్జిద్‌లో మాత్రమే ఆ దేవుని ఎదుట మోకరిల్లాలి, మస్జిద్‌కు వెలుపల సమకాలీన వ్యవస్థ పట్ల భక్తి ప్రపత్తులు, విధేయతా సేవలు చెల్లిస్తూ ఉండాలి అన్నదే ఇస్లామ్ ఉద్దేశ్య మయివుంటే, కేవలం ఈ మాత్రానికే తమ పట్ల కనబరిచే విశ్వసనీయతను లక్ష్యపెట్టక పాలిత ప్రజల మత స్వేచ్ఛలో జోక్యం కలుగజేసుకునే మూఢపాలకుడెవడైనా ఉంటాడా ? ఈ కారణంగానే దైవ ప్రవక్తలు మరియు ఇతర ప్రపంచ శక్తుల మధ్య దైవం గురించి జరిగిన ఘర్షణకు అసలు మూలమేమిటో పరిశీలించడం అవసరం.

దైవ ప్రవక్తలతో ఘర్షణకు పాల్పడ్డవారయిన విశ్వసిం చనివారు, తిరస్కారులు, బహు దైవారాధకులు, అల్లాహ్ ఉనికిని నిరాకరించేవారు కారని దివ్య ఖుర్‌ఆన్‌లో ఒక్కచోట కాదు, అనేక చోట్ల స్పష్టంగా ఉంది అల్లాహ్ వున్నాడనీ భూమ్యాకాశాలను సృష్టించినవాడు, స్వయంగా ఆ తిరస్కారు లను బహు దైవారాధకులను సృష్టించినవాడు కూడా అయనే అనీ, విశ్వ నిర్వహణ అంతా ఆయన కనుసన్నల కనుగుణం గానే జరుగుతోందనీ, నీటిని వర్షింపజేసేవాడు. గాలిని ప్రస రింపజేసేవాడు అయనే అనీ సూర్యచంద్రాది గ్రహాలు, ఉప గ్రహాలన్నీ ఆయన అదుపులో ఉన్నవే అని వారంతా ఒప్పుకునే వారు.

"భూమి మరియు భూమిలో ఉన్నదంతా ఎవరిదో మీకు తెలిసినట్లయితే చెప్పండి" అని వారిని ప్రశ్నించు. "అల్లాహ్‌దే" అనివారు బదులు ఇస్తారు. "అయితే మీరు ఆలోచించరా ?"

అని వారిని అడుగు; వారిని ఇంకా ఇలా ప్రశ్నించు, "సప్తాకాశాలకు. మహోన్నత దైవాసనానికి ప్రభువు ఎవరు?" వారు "అల్లాహ్" అని సమాధానమిస్తారు. "అయనంటె మీకు భయం లేదా?" అని వారిని అడుగు ఇంకా వారిని ప్రశ్నించు అన్ని విషయాల అధికారాలు ఉన్నవాడు, అందరికీ రక్షణ ఇచ్చేవాడు— అయన సమక్షంలో ఎవ్వరూ మరెవ్వరికీ రక్షణ ఇవ్వలేరు— ఎవరో మీకు తెలిసినట్లయితే చెప్పండి" అని. వారు అంటారు: "అల్లాహ్ మాత్రమే" అని అప్పుడు వారితో చెప్పు ... "అయితే మీరు ఏ భ్రమలో పడిపోయారు?" అని.

(ఖుర్ఆన్ అల్ మోమినూన్—5)

భూమ్యాకాశాలను సృష్టించిందెవరో, సూర్యచంద్రుల్ని తన అధీనంలో ఉంచుకున్నదెవరో నీవు వారినడిగితే వారు తప్పక. "అల్లాహ్ మాత్రమే" అని బదులిస్తారు— అయితే వీరు దారి తప్పి ఎటుపోతున్నారు? ఇంకా, "ఆకాశాన్నుండి నీటిని కురిపించేదెవరు? మృతమృణ్ణలికి జీవం తొణికిసలాడే పచ్చికను ప్రసాదించిందెవరు?" అని నీవు వారిని అడిగినట్టయితే "అల్లాహ్" అనే వారు జవాబు పలుకుతారు.

(ఖుర్ఆన్, అన్కబూత్-6)

"మిమ్మల్ని సృష్టించేదెవరూ?" అని వారిని ప్రశ్నించినట్లయితే వారు "అల్లాహ్ మాత్రమే'' అని సమాధానమిస్తారు.... అయితే వారు ఎటు దారితప్పిపోతున్నారు? (జుఖ్రుఫ్-7)

ఈ ఆయత్ల వల్ల తేలిందేమంటే అల్లాహ్ ఉనికి పట్ల, అయన సృష్టికర్త. భూమ్యాకాశాల స్వామి అవడం పట్ల ఎలాంటి

ఖేవాభిప్రాయం తిరస్కారులకు ఉండేది కాదు. ప్రజలు స్వయంగా ఈ విషయాలను నమ్మేవారు. వారు నమ్మే ఈ మాటల్ని నమ్మించడానికి దైవ ప్రవక్తలు రానవసరం లేదు; మరెందుకు వచ్చినట్లు? అసలు ఘర్షణ, వివాదం ఏ విషయంలో ఏర్పడింది? ఖుర్‌ఆన్ ప్రకారం, అసలు వివాదమేమంటే, దైవ ప్రవక్తలు, "మీకూ భూమ్యాకాశాలకూ సృష్టికర్త అయిన వారెవరో ఆయనే మీ "రబ్" మీ ''ఇలాహ్"కూడా. ఆయన తప్ప ఇతరుల్ని ''ఇలాహ్''గా. "రబ్"గా అంగీకరించకండి" అని బోధించేవారు. కాని ప్రపంచం దాన్ని ఒప్పుకునేది కాదు.

ఈ వివాదం వెనుకవున్న మర్మమేమిటో, "ఇలాహ్'' అంటే మరియు "రబ్" అంటే అర్థమేమిటో, అల్లాహ్‌నే ''ఇలాహ్"గా "రబ్"గా అంగీకరించాలని దైవ ప్రవక్తలు ఎందుకు పట్టుపట్టేవారో, మరెందుకు ప్రజలు ఈ మాటపై ఘర్షణకు సిద్ధమయ్యేవారో తెలుసుకోవడం అవసరం. రండి, ఆ పరిశీలన జరుపుదాము.

## ఇలాహ్

ఇలాహ్ అంటే మాబూద్ (ఆరాధ్యుడు) అని సామాన్యంగా అందరికీ తెలిసిన విషయమే. కాని మాబూద్ యొక్క ధాతువు 'అబ్ద్'. అబ్ద్ అంటే దాసుడు, బానిస అని అర్థం. అందులోనుండే "ఇబాదత్" అనే మాట పుట్టింది. ఇబాదత్ (ఆరాధన) అంటే కేవలం పూజ మాత్రమే కాదు, దాసుడు

లేక బానిస గడిపే దాస్యం లేక బానిసత్వపు జీవితమంతా పూర్తిగా ఆరాధనే. సేవ కొరకు సిద్ధంగా నిలబడటం, వినయంగా చేతులు కట్టుకోవడం, దాస్య సూచకంగా తలవంచడం, భక్తి విశ్వాసభావాలతో పరవశించడం, ఆజ్ఞాపాలన కొరకు పరుగిడటం, కృషి చేయడం, ఏ పని చెయ్యమని సంజ్ఞ లభిస్తుందో దాన్ని ఇట్టే చేసిపెట్టడం, స్వామి కోరినదల్లా సమర్పించుకోవడం ఆయన శక్తిబలాధిక్యతల ముందు తన శక్తిలేమిని, అశక్తతను వ్యక్తపరచడం, ఆయన చేసిన చట్టాన్ని పాటించడం, ఆయన దేన్ని ఎదిరించమని ఆదేశిస్తాడో దానిపై లంఘించడం, ఆయన ఆజ్ఞ అయితే తలనయినా త్యాగం చెయ్యడం. ఇదీ ఇబాదత్—ఆరాధన—నకు అసలు భావం. మనిషి ఎవరి ఆరాధన ఈ విధంగా చేస్తాడో ఆయనే వాస్తవానికి అతని ఆరాధ్యుడు.

## రబ్

అరబీ భాషలో 'రబ్' అంటే అసలు అర్థం పోషణ కర్త అని. ఐతే పోషించే వానికే లోకంలో విధేయత పాటిస్తారు. ఆజ్ఞాపాలన కూడా చేస్తారు జనులు. అందువల్ల 'రబ్' అంటే యజమాని, స్వామి అని కూడా అర్థం వస్తుంది. కనుకనే అరబీలో "రబ్బుల్ మాల్" (ధనానికి యజమాని—ధనవంతుడు). రబ్బుద్దార్ (ఇంటి యజమాని) అనే పదబంధాలు ఉనికిలోకివచ్చాయి. మనిషి ఎవరిని తన పోషకుడుగా, సంరక్షకుడుగా భావిస్తాడో, ఎవరి ద్వారా కృప, అనుగ్రహాలు ఆశించగలడో, ఎవరి వల్ల గౌరవాభ్యున్నతులు, శాంతిసుఖాలు

ప్రాప్తమయ్యే ఆశ అతనికుంటుందో, ఎవరి కటాక్షవీక్షణాలు తప్పిపోతే తన మనుగడ మట్టిపాలవుతుందని భయపడతాడో, ఎవరిని తన యజమానిగా, స్వామిగా భావిస్తాడో, మరెవరి ఆజ్ఞాపాలన, విధేయతలు పాటిస్తాడో ఆయనే మనిషి రబ్— ప్రభువు.

ఈ రెండు పదాల అర్థాన్ని దృష్టిలో పెట్టుకుని మనిషి కెదురుగా నిలబడి— "నేను నీ ఇలాహ్‌ను, నేను నీ రబ్‌ను, నన్నే ఆరాధించు, నా సేవయే చెయ్యి" అని ప్రకటించేదెవరో కాస్త పరిశీలనగా చూడండి. చెట్లూ చేమలా ? రాళ్ళూ రప్పలా? నదులూ సముద్రాలా ? పశువులూ పక్షులా ? సూర్యచంద్రులా? గ్రహాలూ నక్షత్రాలా? మనిషి ఎదుటికి వచ్చి ఈ ప్రకటన చేసే సాహసం వీటిలో దేనికయినా ఉందా ? లేదు, ముమ్మాటికీ లేదు. మనిషికెదురుగా నిలిచి దైవత్వపు వాదన చేసే వాడు, చెయ్యగలిగేవాడు కేవలం మానవుడే. దైవత్వపు దురాలోచన, దుష్టపిపాస కేవలం మనిషి మస్తిష్కంలోనే మకాం పెట్టగలదు. మనిషిలోని మితిమేరలు లేని అధికార పిపాస, స్వలాభాపేక్షలే మనిషిని తోటి మానవులపై దైవంగా తయారయ్యేందుకు పురికొలుపుతాయి. వారి ద్వారా తన దాస్యం చేయించుకోడానికి, వారి తలల్ని తనముందు వంచడానికి, వారిపై తన ఆజ్ఞల్ని చెలాయించడానికి, వారిని తన కోరికలు తీర్చుకునేందుకు పరికరంగా వాడుకోవడానికి అతణ్ణి ప్రేరేపిస్తాయి

ఇలా దైవంగా రూపొందడంలో ఉన్న మాధుర్యం కంటే మధురమయింది, మరొకటేదీ మనిషి నేటి వరకు కనిపెట్టలేక

పోయాడు. ఎవరికి ఏ మాత్రం శక్తి, సిరి, తెలివితేటలున్నా లేక మరేదయినా అధిక్యత ప్రాప్తమయినా అతడు తన సహజమయిన న్యాయవంతమయిన అవధుల్ని అతిక్రమించాలని, ఎళ్ళుచాచి, పరిసరాల్లోని మనుషులపై, తన ఎదుట బలహీనులో, ధనహీనులో, బుద్ధిహీనులో లేక మరేవిధంగానయినా తనకంటే తక్కువవారో అయితే వారిపై తన దైవత్వపు ముద్ర వెయ్యాలనే అభిలషిస్తాడు.

ఇలాంటి దైవత్వపు పిపాసగొన్నవారు రెండు కోవలకు చెందినవారు ఉంటారు. వారుభయులూ రెండు విభిన్న మార్గాలు అవలంబిస్తారు.

ఒక రకం మనుషుల్లో సాహసం అధికంగా ఉంటుంది. వారి వద్ద దైవత్వపు పటాటోపం సమకూర్చడానికి చాలినన్ని మార్గాలుంటాయి. అందువల్ల వారు నేరుగా దైవత్వపు ప్రకటనే చేసివేస్తారు. ఉదాహరణకు ఫిరౌను (Pharoh) తన రాజరికం తన సైన్యాల అండజూసుకొని "నేనే మీ అందరికి పరమోన్నత ప్రభువును." "నేను తప్ప మీకు మరో ఆరాధ్యుడు ఉన్నట్లు నేనెరగను" అని ఈజిప్టు ప్రజలతో అనగలిగాడు.

ప్రవక్త మూసా (మోషే) తన జాతికి స్వాతంత్ర్యం కావాలని అతణ్ణి కోరుతూ నీవు కూడా, సర్వలోకాల ఆరాధ్యుడయిన దైవం దాస్యాన్ని స్వీకరించాలని అతనితో చెప్పినప్పుడు అతడు, "నేను నిన్ను జైలుకు పంపగల శక్తిగలవాణ్ణి. అందువల్ల నన్ను ఆరాధ్యుడుగా అంగీకరించు" అని అనగలిగాడు.

"నన్ను కాదని ఇతరుల్ని దైవంగా నమ్ముకుంటే నేను మిమ్మల్ని జైలులో పడవేస్తాను."

ఇలాగే ఇబ్రాహీం (అలై)తో 'నమ్రూద్' వాదానికి దిగిన రోజు ప్రస్తావన కూడా దివ్యఖుర్ఆన్‌లో వచ్చింది. ఆ మాటల్ని కాస్త శ్రద్ధగా గమనించండి :

"ఇబ్రాహీం (అస్సలాం) ప్రభువు ఎవరన్న విషయంపట్ల ఇబ్రాహీం (అస్సలాం)తో వాదించిన వ్యక్తిని చూశావా? అతడు ఈ వాదన ఎందుకు చేశాడు? అల్లాహ్ అతడికి ప్రభుత్వం అనుగ్రహించినందుకు ఇబ్రాహీం (అస్సలాం) అతడితో, "జీవన్మరణాలు తన అధీనంలో కలవాడే నా ప్రభువు" అని అన్నప్పుడు, "జీవన్మరణాలయితే నా అధీనంలో కదా ఉన్నాయి?" అన్నాడు ఆతడు. అప్పుడు ఇబ్రాహీం (అస్సలాం) "సరే, అల్లాహ్ సూర్యుణ్ణి తూర్పున ఉదయింప జేస్తాడు, నీవు కాస్త పడమటివైపు ఉదయింపజెయ్యి చూద్దాము" అన్నాడు. అది విని ఆ తిరస్కారి నిర్ఘాంతపొయ్యాడు. (2:35)

ఆ తిరస్కారి ఎందుకు అలా నిర్ఘాంతపోయాడో ఆలోచించండి. అతడు వాస్తవానికి అల్లాహ్ ఉనికిని తిరస్కరించినవాడు కాదు. విశ్వాన్ని పాలిస్తున్నది అల్లాహ్‌యే అనీ సూర్యుణ్ణి ఉదయింపజేసేది అస్తమింపజేసేది ఆయనే అని అతడు నమ్మేవాడే. విశ్వానికి స్వామి ఎవరన్న విషయంలో కాదు తగాదా, అసలు జగడం; మనుషులకు, ముఖ్యంగా బాబిలోనియా నివాసులకు, ప్రభువు ఎవరు? అన్నదే.

# రాజ్యాధికారంలో దైవత్వం

తానే అల్లాహ్‌నని అతడు వాదించలేదు. అతడు చెప్పే దేమిటంటే ఆ దేశ ప్రజల 'రబ్', ప్రభువును నేనే అని. ప్రభుత్వాధికారం తన చేతిలో ఉండటం మూలాన అతడు ఈ వాదన చెయ్యగలిగాడు. ప్రజల ప్రాణాలపై అతనికి అధీనం, అధికారం ఉండేది. తాను తలచిన వ్యక్తిని ఉరికంబానికెక్కించడానికి లేదా తాను అనుకున్న వ్యక్తి ప్రాణాలను కాపాడటానికి తనకు శక్తి ఉందని అతడు భావించేవాడు. నా మాటే చట్టమని, నా ఆజ్ఞ ప్రజల అందరిపై చెలామణి అవుతుందని అనుకునేవాడు. అందువల్లనే హజ్రత్ ఇబ్రాహీంని అతడు కోరింది తనను "రబ్" (ప్రభువు)గా అంగీకరించాలనీ అతని దాస్యం, ఆరాధన చెయ్యాలనీను. కాని, హజ్రత్ ఇబ్రాహీం, "భూమ్యాకాశాల(రబ్)ప్రభువును, ఈ సూర్యుడు కూడా ఎవరినైతే ఆరాధిస్తున్నాడో ఆయన్నే నేను రబ్‌గా స్వీకరిస్తాను, ఆయనకే దాస్యం చేస్తాను, ఆయన్నే ఆరాధిస్తాననీ అనగానే ఆ తిరస్కారి నిర్ఘాంతపోయాడు— ఇలాంటి వ్యక్తిని ఎలా అదుపులో పెట్టాలా? అని !

ఫిరౌను మరియు నమ్రూద్ చేసిన ఈ దైవత్వపు వాదనలు కేవలం వీరిద్దరికే పరిమితం కాదు. ప్రపంచంలో ప్రతిచోటా రాజ్యాధిపతులు ఈ వాదనే చేశారు— ఇప్పటికీ చేస్తున్నారు కూడా.

ఈరాన్ దేశంలో పూర్వం రాజును ఖుదా, ఖుదావంద్ (దైవం) అనే పదాలతో సంబోధించేవారు. వారి ముందు

ఆరాధనాలాంఛనాలు పూర్తిగా నిర్వహించబడేవి. వాస్తవానికి ఈరానీయనుల్లో ఒక్కడు కూడా వారిని "ఖుదాయె ఖుదాగాన్" (దేవదేవుడు పరమేశ్వరుడు) అంటే అల్లాహ్ అని భావించేవాడు కాడు. ఆ రాజులు కూడా ఆ విధంగా వాదించేవారు కారు. ఇలాగే భారత దేశంలో రాజులు తమ వంశపరంపరను దేవతలతో కలుపుకునేవారు— సూర్యవంశం, చంద్రవంశం నేటికీ పేరుగన్న వంశాలే— రాజుల్ని అన్నదాత అంటే "రాజిక్" అని పిలిచేవారు. అతడి ముందు సాష్టాంగపడేవారు. అయితే వాస్తవానికి తాను పరమేశ్వరుడు అని రాజు కూడా వాదించేవాడు కాదు, ప్రజ కూడా అలా భావించేది కాదు.

ప్రపంచంలోని ఇతర దేశాల పరిస్థితి కూడా ఇలాగే ఉండేది— నాడయినా, నేడయినా! ఇలాహ్ మరియు రబ్ అనే పదాలకు సమానార్థంగల పదాలతో రాజుల్ని స్పష్టంగా సంబోధించడం నేటికీ కొన్ని చోట్ల జరుగుతోంది. అయితే ఎక్కడైనా ఇలా జరక్కపోతే అక్కడ ఈ పదాల్లోని భావసారం ఆచరణలో గోచరిస్తోంది. ఈ ఫక్కీకి చెందిన దైవత్వపు వాదనచేసే వ్యక్తి స్పష్టంగా తానే ఇలాహ్ లేక రబ్ అని వాదన చెయ్యనవసరం లేదు. మానవులపై ఫిరౌన్, నమ్రూద్‌ల వంటి ప్రభుసత్తాను, అధికారాన్ని, ఆధిపత్యాన్ని, యాజమాన్యాన్ని, దైవత్వాన్ని తామూ స్థాపించాలని తలచినవారంతా, ఇలాహ్ మరియు రబ్ అనే పదాలను తమ వాదనలో లేవనెత్తకపోయినా వాస్తవానికి ఆ పదాల అర్థంలో, వాటి భావంలోనే వారు తమ వాదనను ముందుకు తెస్తారు. వారి విధేయత దాస్యాలు చేసే ప్రజలందరు కూడా ఎట్టి పరిస్థితిలోనూ ఆ రాజులు తమ ఇలాహ్

మరియు రబ్‌లు అవుతారని అంగీకరించినట్లే, వారు నోటితో ఆ మాటల్ని పలకకపోయినా !

## మరో రకం దైవాలు

మొత్తానికి తాము ఆరాధ్యులమని, పోషకులు, సంరక్షకులమని ప్రత్యక్షంగా వాదించేవారు ఒక కోవకు చెందిన వారయితే, మరో కోవకు చెందినవారు ఇలాంటి వాదన చేసి ప్రజలచేత ఒప్పించే శక్తి సామర్థ్యాలు సాధనాలూ తమకు లేకపోవడం వల్ల నేర్పుతో, మోసంతోవారు సామాన్య ప్రజల మనస్సూ, మేధస్సులపై మంత్రంలాంటిది చెయ్యగలుగుతారు. ఈ ఆయుధాల్ని, సాధనాల్ని ఉపయోగించి వారు ఏ దయ్యాన్నో, దేవతనో, విగ్రహాన్నో, నక్షత్రాన్నో లేక సమాధినో చెట్టునో, పుట్టనో ఇలాహ్ (ఆరాధ్య దైవం)గా చేసివేస్తారు. ప్రజలతో: "ఇవి మీకు లాభనష్టాలు కలిగించగలవు. మీ అక్కర్లను తీర్చగలవు. ఇవి మీ ఆప్తులు సంరక్షకులు, సహాయకులు. వీటిని సంతోషపరచకపోతే మిమ్మల్ని, క్షామానికి, వ్యాధులకు, ఆపదలకు గురిచేస్తాయి. వీటిని సంతోషపరచి ప్రసన్నులుగా చేసుకుని మీకు అవసరమైనవి వేడుకున్నారంటే ఇవి మీ సహాయానికి వస్తాయి. అయితే వీటిని సంతోషపరిచేందుకు, వాటిని మీ పరిస్థితులను విన్నవించుకునేందుకు అవసరమయిన విధానాలు మాకు తెలుసు, వాటివరకు చేరాలంటే మా ద్వారానే సాధ్యం. మా ఘనతను అంగీకరించండి. మమ్మల్ని సంతోషపెట్టండి. మా చేతుల్లో మీ ధనమాన

ప్రాణాలు పెట్టండి" అంటారు. చాలామంది అవివేకులు ఈ ఇంద్రజాలంలో ఇరుక్కుంటారు. తప్పుకు దేవుళ్ళ చాటుగా పురోహితుల, పూజారుల, ముజావరుల దైవత్వం స్థిర పడుతుంది.

ఈ రకానికి చెందిన మరికొందరు జ్యోతిష్యమని, తారా బలం, చంద్రబలమని, శకున శాస్త్రమని, తాయెత్తులనీ, మంత్ర తంత్రాలని ఎన్నో ఆధారాలు చూసుకుంటారు. ఇంకా కొందరు అల్లాహ్ దాస్యాన్నయితే ఒప్పుకుంటారు కాని మనిషి నేరుగా అల్లాహ్‌ను చేరడం అసాధ్యం అనీ, ఆయన దివ్యసన్నిధిని చేర డానికి మా అలంబన అవసరమని, ఆరాధనా లాంఛనాలన్నీ మా ద్వారానే నెరవేరాలనీ, మీరు పుట్టినప్పటి నుండి గిట్టి పోయేవరకు అవసరమయిన ధార్మిక లాంఛనాలన్నీ మా చేతుల మీదుగా జరగవలసిందే అని అంటారు. కొంతమంది దైవ గ్రంథాన్ని స్వాధీనం చేసుకుంటారు, సామాన్య ప్రజలకు దాని బోధలు అందకుండా చూస్తారు. తామే స్వయంగా దైవవాణిగా మారి ధర్మాధర్మాల ఆదేశాలు జారీ చెయ్యడం మొదలెడతారు. ఈ విధంగా వారి మాటే దైవ వాక్కు. వారు మనుషుల్ని, దైవానికి బదులుగా తమకు విధేయులుగా చేసుకుంటారు. అతి ప్రాచీన కాలం నుండి నేటి వరకు అనేక పేర్లతో, అనేక రూపాల్లో ప్రపంచంలో నలుమూలలా వ్యాపించివున్న బ్రాహ్మణ త్వానికి, పాపలిజం (Papalism)నకు అసలు మూలం ఇదే. దీని కారణం కొన్ని కుటుంబాలు, వంశాలు లేక వర్గాల వారు

సామాన్య ప్రజల మనోఫలకాలపై తమ నాయకత్వపు చెరగని ముద్ర వేయగలిగారు

## కీడుకు మూలం

ఈ దృష్టితో మీరు కాస్త లోతుగా పరిశీలించారంటే, ప్రపంచంలో కీడులన్నిటికీ మూలకారణం, కల్లోలానికి అసలు కటుకు, పరోక్షంగానూ, ప్రత్యక్షంగానూ మనిషి మనిషిపై చెలాయించే దైవత్వమే అని తెలుసుకుంటారు. దీని మూలంగానే చెడు అన్నది పుడుతోంది. దీని ద్వారానే నేటికి విషపు ఊట్లు ప్రవహిస్తున్నాయి. అల్లాహ్ అయితే మనిషి నైజంలోని రహస్యాలన్నీ ఎరిగినవాడే. కాని మనిషి ఎవరినో ఒకరిని తన ఇలాహ్ మరియు రబ్‌గా నమ్మకుండా ఉండలేడన్న సత్యాన్ని మనం తరతరాల అనుభవం ద్వారా ఇప్పుడు పూర్తిగా తెలుసుకున్నాము, అంటే ఎవరో ఒకరు ఇతని ఇలాహ్ మరియు రబ్ కాకపోతే ఇతను జీవించడమే దుర్లభం! అల్లాహ్‌ను స్వీకరించలేకపోయినా 'ఇలాహ్' మరియు 'రబ్'ల బారి నుండి తప్పుకోలేడు. ఇలాంటి పరిస్థితిలో అనేక 'ఇలాహ్'లు మరియు 'రబ్'లు అతనిపై వచ్చి తిష్టవేసుకుంటారు, అతణ్ణి లోబరచుకుంటారు.

జాగ్రత్తగా పరిశీలించి చూడండి. రష్యాలో కమ్యూనిస్టు పార్టీ పోలిట్ బ్యూరో (Polit Bureau) సభ్యులు రష్యా ప్రజల రబ్‌లు, ఇలాహ్‌లు కారా? స్టాలిన్ వారి రబ్‌ల రబ్ (దేవ దేవుడు, ప్రభువుల ప్రభువు) కాడా? రష్యనుల ఈ దేవుని చిత్రపటం లేని ఏ గ్రామం, ఏ వ్యవసాయ క్షేత్రం ఉందనీ?

ఘోన్న పోలెండు భూభాగాన్ని రష్యా ఆక్రమించుకున్నప్పుడు అక్కడ సోవియట్ విధానాన్ని ప్రవేశపెట్టేందుకు ఏ విధంగా ప్రచారం చేశారో మీకు తెలుసు. స్టాలిన్ చిత్రాలు వేల సంఖ్యలో తెప్పించి ఒక్కొక్క గ్రామంలో అమర్చారు. తన్మూలంగా అక్కడి ప్రజలు తమ మహారాజ్యాల దేవుణ్ణి, మహోన్నత ప్రభువుని తెలుసుకోవాలి. ఆ తరవాతే వారికి "బాల్షివికీయ" లేక "బాల్ష్వికీయ" ధర్మంలో ప్రవేశం లభిస్తుంది. ఒక్క మనిషికి ఈ ప్రాముఖ్యం దేనికి? ఒక వ్యక్తికి, అతడు సంఘానికి ప్రాతినిధ్యం వహిస్తున్నాడన్న నెపంతో కోటానుకోట్ల ప్రజల మనోమస్తిష్కాలపై అతని వ్యక్తిత్వపు ముద్ర వేయించి అతని ఘనత, అధికారాలు చెప్పడనం వారి అణువణువులో నాటుకుపోయినట్లు చెయ్యడం దేనికి? ఈ విధంగానే కదా వ్యక్తిగత అధికారం లోకంలో నెలకొనేది, ఈ విధంగానే కదా మనిషి మనుషుల దైవమయి కూర్చునేది, ఈ రీతినే కదా ఎల్లకాలాల్లోనూ ఫిరౌను, నమ్రూదు, జారు, సీజరుల్లాంటి వారి దుష్టాధికారం స్థిరమయి నిల్చున్నది!

ఇదేవిధంగా ఇటలీ దేశాన్ని చూడండి, అక్కడ ఫాసిస్ట్ గ్రాండ్ కౌన్సిల్ కొందరు ఇలాహ్ (దేవుళ్ళ)ల సముదాయం. ముసోలెని వాళ్ళందరికంటే పెద్ద దేవుడు. జర్మనీలో 'నాజీ' పార్టీ నాయకులు ఈశ్వరులు మరియు హిట్లర్ వాళ్ళ పరమేశ్వరుడు! ఇంగ్లండు ప్రజాస్వామిక విధానం అనుసరించినప్పటికీ బాంక్ ఆఫ్ ఇంగ్లండ్ యొక్క డైరెక్టరు మరియు కొందరు ఉన్నత వర్గానికి చెందిన శ్రీమంతులు, సర్దార్లు ఆ దేశపు ఇలాహ్‌లు (దేవుళ్ళు)గా రూపుదిద్దుకున్నారు. అమె

రికాలో "వాల్‌స్ట్రీట్"లోని కొందరు ధనవంతులు ఆ దేశం మొత్తానికి 'రబ్' మరియు 'ఇలాహ్'లుగా రూపొందారు.

ఇంతకు మీరు ఎటు కళ్ళెత్తి చూచినా ఒకచోట ఒక జాతి మరో జాతికి ఇలాహ్‌గా ఉంటె మరో చోట ఒక వర్గం ఇతర వర్గాల పాలిటి ఇలాహ్‌గా నిలబడి ఉంది. ఒకచోట ఒక పార్టీ ఇలాహ్, రబ్‌గా రూపొందితే ఇంకోచోట ఒక నియంత నిలబడి, "నేను తప్ప (మీకు దైవం) ఇతరంబెరుగ" అని ఉద్ఘోషిస్తున్నాడు. మానవుడు ఏ ఒక్కచోట అయినా "ఇలాహ్" లేకుండా లేడు !

## మనిషి దైవత్వానికి పరిణామాలు

అయితే ఇలా మనిషిపై మనిషి దైవత్వం నెలకొన్న దానికి ఫలితం ఏమిటీ? ఒక నీచుణ్ణి, సంకుచిత బుద్ధిగలవాణ్ణి పోలీసు కమీషనర్‌గా నియమించడం వల్ల కలిగే పరిణామమే! అజ్ఞాని, అల్పబుద్ధిగలవాణ్ణి ప్రధాన మంత్రిగా చెయ్యడం వల్ల కలిగే పరిణామమే !! అసలు 'దైవత్వపు' నిషా ఎలాంటిదంటే దాని కైపు ఎక్కిన మనిషి అసలు అదుపులోనే ఉండడు. ఒక వేళ అదుపులో ఉండడానికి ఒప్పుకున్నా దైవత్వపు బాధ్యతల నిర్వహణకు కావలసిన జ్ఞానం, అవసరమయిన నిష్పక్షపాత బుద్ధి, నిస్వార్థత, నిరాపేక్షాపరత ఇత్యాది గుణాలు మనిషికెలా అబ్బుతాయి ? ఈ కారణంచేతనే ఎక్కడెక్కడయితే మనిషిపై మనిషి దైవత్వం, ప్రభుసత్తాకం నెలకొల్పడం జరిగిందో అక్కడల్లా దౌర్జన్యం, అత్యాచారం, అధర్మమయిన లాభసము

పార్జన. పక్షపాతం, అసమానతలు ఏవో ఓ విధంగా దాచివేసు కున్నాయి. అక్కడ మానవ ఆత్మ తన సహజ స్వేచ్ఛకు దూరమయిపోయింది ; అక్కడ మనిషి మనోమస్తిష్కాలపై అతని సహజ శక్తిసామర్థ్యాలపై ఏర్పడిన నిర్బంధాల కారణంగా మానవుల వ్యక్తిత్వపు ప్రగతి వికాసాలు నిలిచిపోయ్యాయి. ఎంత నిజం పలికారు సత్యస్వరూపులయిన దైవ సందేశహరులు (సఅసం)

"అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు, నేను నా దాసుల్ని సరయిన నైజం ప్రకారం సృష్టించాను. తరువాత షైతాన్ వారిని చుట్టు ముట్టాడు. వారిని వారి సహజమయిన సన్మార్గాన్నుండి తప్పించి తీసుకెళ్ళాడు. నేను దేన్నయితే వారికొరకు హలాల్ (ధర్మసమ్మతమయింది)గా నిర్ణయించానో అది వారికి ప్రాప్తం కాకుండా చేశాడు" (ఖుద్సీ హదీసు)

పైన పేర్కొన్న విధంగా మనిషిపై మనిషి దైవత్వం అన్నదే మానవుని సకల ఇక్కట్లకు, అతని సర్వవినాశాలకు, అతను గురయి ఉన్న అన్ని రకాల దౌర్భాగ్యాలకు మూల కారణం. ఇది అతని ప్రగతికి మూలప్రతిబంధకం. అతని నైతికతకు, అతని ఆధ్యాత్మికతకు, శాస్త్రీయ, ఆలోచనా శక్తికి, అతని నాగరిక, సాంఘిక వ్యవస్థలకు, అతని రాజకీయ, ఆర్థిక పద్ధతులకు. ఒక్క మాటలో చెప్పాలంటే అతని మానవతకే క్షయ వ్యాధిలా లోలోనే తొలచివేస్తున్న రోగమిది. ఇది అత్యంత ప్రాచీన కాలం నుండి ఇలానే ఉంది. ఈ మహా రోగానికి నివారణం కేవలం ఒక్కటే. మానవులు సకల ప్రభు

సత్తాక శక్తుల్ని, సమస్త దైవాలను తిరస్కరించి కేవలం అల్లాహ్‌ను తమ దైవంగా, కేవలం సకల లోకాల ప్రభువును తమ ప్రభువుగా అంగీకరించాలి. ఇంతకంటే వేరుగా మరో మార్గమూ మానవ మోక్షానికి లేదు. ఎందుకంటే దైవ తిరస్కారి నాస్తికవాదిగా మారి కూడా మనిషి 'దైవాల' నుండి, ప్రభు సత్తాక శక్తుల నుండి తప్పించుకోలేకున్నాడు.

## దైవ ప్రవక్తల సంస్కరణ

దైవ ప్రవక్తలు మానవ జీవితంలో చేసిన అసలు మౌలిక మయిన సంస్కరణ ఇదే. మనిషిపై మనిషి దైవత్వాన్ని నిర్మూలించడమే వారి ఆవిర్భావానికి అసలు లక్ష్యం. మనిషిని ఈ దౌర్జన్యం బారి నుండి, ఈ మిథ్యా దేవుళ్ళ దాస్యం నుండి, ఈ అత్యాచార పంజరం నుండి, ఈ అధర్మ లాభసముపార్జన దోపిడి నుండి మోక్షాన్ని ప్రసాదించడమే వీరి ధ్యేయం. ఏ మనుషులయితే మానవత్వపు హద్దుల్ని అతిక్రమించారో వారిని వెనక్కి నెట్టి తిరిగి ఆ హద్దులోకి చేరవెయ్యడం, మరెవరయితే అణగద్రొక్కబడ్డారో వారిని లేవనెత్తి ఆ హద్దు వరకు పైకి తేవడం వారి లక్ష్యం. అందరూ ఓ న్యాయవంతమయిన జీవన వ్యవస్థకు కట్టుబడి ఉండేలా చెయ్యడం, అందులో ఏ మనిషీ మరో మనిషికి దాసుడూ కాకుండా, దైవమూ కాకుండా అందరూ ఒకే దైవానికి, అల్లాహ్‌కు దాసులయ్యేలా చెయ్యడం వారి లక్ష్యం. ఆది నుండి ఆవిర్భవించిన ప్రవక్తలందరిదీ ఒకే సందేశం, అది :

"ప్రజలారా! అల్లాహ్ దాస్యం చెయ్యండి. ఆయన

తప్ప మీకు మరో దైవం లేడు."

ఈ మాటనే హజ్రత్ నూహ్, హజ్రత్ సాలెహ్, హజ్రత్ షుయైబ్ అన్నారు (హూద్ : రుకూ — 4, 5, 6, 8). దీన్నే మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) ప్రకటించారు :

"నేను మీకు హెచ్చరించడానికి వచ్చాను అందరిపై ఆధిక్యతగలవాడు. భూమ్యాకాశాలకు, వాటి మధ్యన ఉన్నదానంతటికీ ప్రభువయినవాడు అయిన అల్లాహ్ ఒక్కడే తప్ప మరో దైవం లేడు." (సాద్ : 66)

"నిస్సందేహంగా మీ ప్రభువు భూమ్యాకాశాలను, సూర్యుణ్ణి, చంద్రుణ్ణి, నక్షత్రాలను సృష్టించిన అల్లాహ్‌యే. అన్నీ ఆయన ఆజ్ఞలకే బద్ధులు జాగ్రత్త! సృష్టి కూడా ఆయనదే. పరిపాలన **కూడా** ఆయనదే." (ఆరాఫ్ : 54)

"ఆయనే అల్లాహ్. ఆయనే మీ ప్రభువు. ఆయన తప్ప మరే దైవం లేడు. ఆయన ప్రతిదానికి సృష్టికర్త. కనుక మీరు ఆయన దాస్యమే చెయ్యండి. ఆయన ప్రతిదాన్నీ కని పెట్టి ఉన్నాడు." (అన్‌ఆమ్ : 102)

"వారికి ఇది తప్ప మరే ఆజ్ఞ ఇవ్వడం జరగలేదు; అల్లాహ్ దాస్యం చెయ్యాలి. అందరినీ కాదని ఆయన విధేయతను పాటించాలి." (బయ్యిన : 5)

"రండి, మీకూ మాకూ మధ్యన సమంగా వర్తించే ఒక మాట వైపుకు, అదేమంటే మనం అల్లాహ్ తప్ప మరెవరి

దాస్యం చెయ్యరాదు. ఆయన దైవత్వంలో ఎవరినీ సహవర్తులుగా ఎంచరాదు మనలో ఎవ్వరూ దైవం తప్ప ఇతరుల్ని తమ ప్రభువుగా భావించరాదు." (ఆలి ఇమ్రాన్ : 64)

ఈ ప్రకటనే మానవుని ఆత్మను, అతని వివేచన, ఆలోచనల్ని అతని భౌతిక మానసిక శక్తుల్ని అవి ఏ బంధనాల్లో బంధించబడి ఉండేవో వాటి నుండి రక్షించింది; ఏ భారం క్రింద అవి అణగి ఉండేవో దాన్ని తొలగించింది. ఇది మానవాళికి నిజమయిన స్వేచ్ఛకు, స్వాతంత్ర్యానికి సంబంధించిన చార్టర్.

"ఈ ప్రవక్త వారిపై మోపబడివున్న బరువుల్ని తొలగిస్తాడు, వారు బంధించబడి ఉన్న బంధనాల్ని త్రెంచుతాడు." (ఆరాఫ్ : 157)

## రాజకీయ సిద్ధాంతానికి మౌలికాంశం

దైవ ప్రవక్తలు మానవ జీవితానికై ప్రతిపాదించిన వ్యవస్థ, దాని కేంద్ర బిందువు, దాని సారం దాని ప్రాణం గత పంక్తుల్లో పేర్కొన్న విశ్వాసమే. దీనిపైనే ఇస్లామీయ రాజకీయ సిద్ధాంతం ఆధారభూతమయింది. ఇస్లామీయ రాజకీయాల ప్రాథమిక సూత్రమేమిటంటే, ఆజ్ఞాపించే, శాసనాలు నిర్మించే అధికారాలన్నీ — వ్యక్తిగతమయినవీ, సామూహికమయినవీ— మానవులందరి నుండి వేరుచేసి వెయ్యాలి. ఒక వ్యక్తి ఆజ్ఞాపించగా ఇతరులు అతని విధేయతను పాటించాలన్న

హక్కును ఏ వ్యక్తిపట్లనయినా సరే అంగీకరించరాదు. ఈ అధికారం కేవలం అల్లాహ్‌కే పరిమితం :

"ఆజ్ఞాపించే అధికారం కేవలం అల్లాహ్‌దే. ఆయనకు తప్ప మరెవరికీ దాస్యం చేయరాదన్నది ఆయన ఆదేశం. ఇదే సరయిన, ఋజువయిన జీవన ధర్మం.

(ఖుర్ ఆన్—యూసుఫ్ : 40)

"అధికారాల్లో మాకూ ఏదయినా భాగముందా?" అని వారు అడుగుతున్నారు. వారితో చెప్పివెయ్యండి. "అధికారాలయితే అన్నీ అల్లాహ్‌కే హస్తగతమయి ఉన్నాయి."

(ఖుర్ ఆన్— ఆలిఇమ్రాన్ : 154)

"ఇది హలాల్ (ధర్మసమ్మతమైనది) అని, అది హరామ్ (ధర్మసమ్మతం కానిది) అని మీ నోళ్ళ నుండి ఉట్టిగనే తప్పుడు మాటలను పలకకండి." (ఖుర్ ఆన్—అన్‌నహ్ల్ : 116)

"ఎవరయితే దైవం అవతరింపజేసిన షరీఅత్ ప్రకారం తీర్పు చెయ్యరో వారే వాస్తవానికి అత్యాచారులు."

(ఖుర్ ఆన్—అల్ మాయిద : 45)

ఈ సిద్ధాంతం ప్రకారం ప్రభుసత్తాకం (Sovereignity) కేవలం దైవానికే చెందుతుంది. శాసన నిర్మాత (Law giver) కేవలం దైవమే. ఏ మానవుడయినా— అతడు ప్రవక్త అయినా సరే—స్వయంగా ఆజ్ఞాపించే లేక నిషేధించే అధికారం కలిగి లేడు. ప్రవక్త స్వయంగానే అల్లాహ్ ఆజ్ఞల్ని పాలించడానికి బద్ధుడు.

"నేనయితే కేవలం నాపై వహీ ద్వారా అవతరింపజెయ్యబడినిని దాన్నే అనుసరిస్తాను." (ఖుర్ఆన్—అన్ ఆమ్ : 50)

జనసామాన్యం. ప్రవక్తల విధేయత పాటించాలన్న నియమానికి కూడా కారణం. ప్రవక్తలు తమ అజ్ఞల్ని కాక దైవాజ్ఞల్ని జారీ చెయ్యడమే.

"మేము ఏ ప్రవక్తను పంపినా అయన్ని కేవలం అల్లాహ్ అనుమతి (Sanction) ఆధారంగా, అనుసరించాలని మాత్రమే (పంపాము)." (ఖుర్ఆన్—అన్-నిసా : 64)

"ఈ ప్రవక్తలు ఎలాంటి వారంటే వీరికి మేము మా గ్రంథాన్ని ఇచ్చాం. అధికారాన్ని (Authority) అనుగ్రహించాము, దైవదౌత్యాన్ని ప్రసాదించాము."

(ఖుర్ఆన్—అన్ ఆమ్ 89)

అల్లాహ్ తనకు గ్రంథాన్ని, అధికారాన్ని, దైవదౌత్యాన్ని ప్రసాదించగా అతడు జనులతో మీరు దైవానికి బదులు నా దాసులు కండి అని అనడం ఏ దైవదాసుడూ చేసే పని కాదు. అతడు అనేది కేవలం, "మీరు రబ్బానీలు (దైవభక్తులు) అవండి" అని మాత్రమే (ఖుర్ఆన్—ఆలిఇమ్రాన్ : 79)

పైనుదహరించిన దివ్యఖుర్ఆన్ ప్రకటనల ద్వారా తేలేదేమంటే, ఇస్లామీయ రాజ్యం యొక్క ప్రాథమిక లక్షణాలు ఇలా ఉంటాయి :

(1) ఒక వ్యక్తి, ఒక వంశం, ఒక వర్గం, ఒక ముఠా

లేక రాజ్యంలోని జనాభా అంతా కలసి కూడా ప్రభుసత్తాకాన్ని కలిగి ఉండరు, ప్రభువు కేవలం దైవమే. మిగతా వారంతా (చరాచర సృష్టి యావత్తు) కేవలం పాలితులే.

(2) శాసన నిర్మాణాధికారాలన్నీ కూడా దైవం తప్ప మరెవరికీ లెవ్వు. ముస్లిములందరు కలసి కూడా తమ కొరకు ఒక శాసనాన్ని నిర్మించుకోనూ లేరు, లేక దైవం నిర్మించిన ఒక శాసనంలో ఎలాంటి మార్పునూ చెయ్యలేరు.

(3) ఇస్లామీయ రాజ్యం ఎట్టి పరిస్థితిలోనూ దైవం తరఫున ఆయన ప్రవక్త అందజేసిన శాసనాల ఆధారంగానే నెల కొల్పబడుతుంది. ఈ రాజ్యాన్ని ఏలే ప్రభుత్వానికి ప్రజలు విధేయత చెల్లించాలంటే, దానికి కావలసిన అర్హత. అది దైవ శాసనాన్ని జారీచేసి అమలుజరిపించేదిగా ఉన్న పరిస్థితిలోనే ప్రాప్తమవుతుంది.

## ఇస్లామీయ రాజ్యం

ఈ ప్రత్యేకతల్ని ఒక్కసారి చూచిన వ్యక్తి అయినా ఇట్టే గ్రహించగలడు. ఇది సామాన్య భావంలో ప్రజాస్వామ్యం (Democracy) కాదని. ఎందుకంటే దేశంలోని సామాన్య పౌరులకు ప్రభుసత్తాకం ఉండే ప్రభుత్వ విధానాన్నే ప్రజాస్వామ్యం అనంటారు. వారి అభిప్రాయాల ప్రకారమే శాసనల్లో మార్పులు చేర్పులు జరగాలి. వారి అభిప్రాయాల ప్రకారమే శాసనాలూ నిర్మించబడాలి. వారు కోరిన చట్టమే అమలు

జరపబడాలి. వారికి ఇష్టం కానిది శాసన గ్రంథం నుండే చెరిపివెయ్యబడాలి. ఈ విషయం ఇస్లామ్‌లో కానరాదు అందు వల్ల ఈ భావంలో దాన్ని ప్రజాస్వామ్యం అనడానికే వీల్లేదు. దీనికి అత్యధికంగా సరిపడే పేరు "దైవిక ప్రభుత్వం" అన్నది దాన్ని ఇంగ్లీషులో **Theocracy** అంటారు. కాని మనకు పాశ్చాత్యులు నేర్పిన భావంలో మాత్రం కాదు. యూరోపుకు ఏ విధమైన థియోక్రసి తెలుసో దానికి పూర్తిగా భిన్నమయింది ఇస్లామీయ థియోక్రసి

యూరోపుకు తెలిసిన ఓ ప్రత్యేక మతపరమయిన వర్గం **Priest Class** దైవం పేరిట స్వయంగా తాను నిర్మించిన శాసనాలను అమలుపరిచేది. * క్రియాత్మకంగా తన దైవత్వాన్నే సామాన్య ప్రజలపై రుద్దేది ఇలాంటి ప్రభుత్వాన్ని దైవిక ప్రభుత్వం అనడం కంటే దయ్యాల ప్రభుత్వం అనడం సముచితం.

## పరిమిత ప్రజాస్వామ్యం

దీనినే భిన్నంగా ఇస్లామ్ సూచించే థియోక్రసిలో అధికా

---

* క్రైస్తవ పోపులు ఫాదరీల వద్ద క్రీస్తు బోధించిన కొన్ని నైతిక బోధలు తప్ప ఎలాంటి శాసనాంగమూ లేదు. అందువల్ల వారు తమ ఇష్టం ప్రకారం తమ మనోవాంఛల కనుగుణంగా చట్టాలు చేసి ఇవి దైవం తరఫున వచ్చినవని ప్రకటించి అమలుపరిచేవారు. "తమ స్వహస్తాలతో గ్రంథాలు రచించి ఇవి దైవం తరఫున వచ్చినవి అని చెప్పేవారిపై అభిశాపం కల్గుగాక !

రం ఓ ప్రత్యేక మతపరమయిన వర్గానికి హస్తగతమై ఉండదు. వాస్తవంగా అది సామాన్య ముస్లిముల చేతుల్లో వుంటుంది, ఈ సామాన్య ముస్లింలు దాన్ని దైవ గ్రంథం, దైవ ప్రవక్త సంప్రదాయం ప్రకారం నడుపుతారు, నాకు ఓ కొత్త పదబంధాన్ని సృజించే అనుమతి లభిస్తే నేను ఈ ప్రభుత్వ విధానాన్ని Theodemocracy "అంటే దైవికమైన ప్రజాస్వామ్య ప్రభుత్వం" అని నామకరణం చేసేవాణ్ణి. ఎందుకంటే ఇందులో దేవుని సర్వాధికారం ఆయన సార్వభౌమాధికారం ఆధీనంలోనే ముస్లింలకు ఓ పరిమితమయిన ప్రభుసత్తాకాన్ని ప్రసాదించడం జరిగింది. ఇందులో పరిపాలనా వ్యవస్థ (Executive) ముస్లిముల ఎన్నిక ద్వారానే నియమించబడుతుంది. సామాన్య ముస్లిములే దాన్ని బర్తరఫ్ చేసే అధికారం కలిగివుంటారు, పరిపాలనకు సంబంధించిన సమస్యలన్నీ — వాటిని గురించే స్పష్టమయిన ఆదేశాలు దైవశాసనం (షరీఅత్)లో లేకపోతే — ముస్లిముల సామూహిక నిర్ణయాల ద్వారానే పరిష్కరించబడతాయి. దైవ శాసనాన్ని అమలుజరుపవలసివచ్చినా, దాని అర్థాన్ని నిర్వచించవలసివచ్చినా, దానికి ఏ ప్రత్యేక వర్గమో లేక ఏ ప్రత్యేక వంశమో అధికారం కలిగివుండదు, సామాన్య ముస్లిముల్లోనే ఇజ్తిహాద్‌లో — షరీఅత్‌ను అనువర్తింపజేసే శాస్త్రంలో — సామర్థ్యం సంపాదించివున్నవారు దాన్ని నిర్వచించే అర్హతలు కలిగివుంటారు. ఈ విధంగా ఇది ప్రజాస్వామ్యమే కానీ దైవం ఆయన ప్రవక్త ఆదేశాలు వున్నచోట ముస్లిముల ఏ నాయకుడయినా, ఏ శాసన సభ్యుడయినా, ఏ షరీఅత్‌ను అనువర్తింపజేసే వ్యక్తి (ముజ్తహిద్) అయినా మరే షరీఅత్ వేత్త అయినా

ఏ ధర్మజ్ఞాని అయినా ఇంకా ప్రపంచ ముస్లిం ప్రజలందరయినా అందరూ కలసి అయినా ఆ దైవాజ్ఞలో రవ్వంతయినా మార్పు చేసే అధికారం కలిగిలేరు. ఈ రూపంలో ఇది థియోక్రసిసే.

## ఓ అభ్యంతరం

ముందుకు సాగడానికి పూర్వం, ఇస్లామ్‌లో ప్రజాస్వామ్యంపై పరిమితులు, ప్రతిబంధకాలు విధించడానికి కారణం ఏమిటో, పరిమితులు, ప్రతిబంధకాల స్వరూపం ఎలాంటిదో నేను ఇక్కడ వివరిస్తాను. ఈ విషయంలో తలెత్తే ఓ అభ్యంతరం ఏమిటంటే, ఈ విధానంలో దైవం, మానవ మస్తిష్కాలు, ఆత్మ, బుద్ధీవివేకాల స్వేచ్ఛను హరించివేశాడు అన్నది. కాని ఇంతకుముందు చర్చించినట్లు వాస్తవానికి దైవం మానవునికి తన బుద్ధీవివేకాలపై, శరీరం, ప్రాణాలపై స్వేచ్ఛ నిచ్చాడు. పై అభ్యంతరానికీ, ఈ వాదనకూ — ఈ రెంటికీ పొంతన ఏది ?

దీనికి సమాధానమేమిటంటే, శాసన నిర్మాణాధికారాన్ని దైవం తన చేతుల్లో ఉంచుకోడానికి కారణం మానవునికి జన్మతః సంక్రమించే స్వేచ్ఛను కాజెయ్యటం కాదు, దాన్ని పరిరక్షించడానికే. మానవుడు మార్గవిహీనుడయి తన సొంత కాళ్ళపై గొడ్డలి కొట్టుకోకుండా పరిరక్షించడమే దీని ముఖ్యోద్దేశ్యం.

## ఇదీ ప్రజాస్వామ్యం

ప్రఖ్యాతులుగన్న పాశ్చాత్య ప్రజాస్వామ్యంలో ప్రజల

సార్వభౌమాధికారం (Popular Sovereignity) ఉంటుందన్నది కేవలం ఓ ఉద్ఘోషణే. దాన్ని కాస్త విశ్లేషించి చూస్తే తెలుస్తుంది- ఏ ప్రజలయితే కలసి ఉండటంచేత ఓ రాజ్యం ఏర్పడుతుందో వారంతా స్వయంగా శాసన నిర్మాణమూ చెయ్యరు వారు స్వయాన దాన్ని అమలూ పరచరు. వారు తమ సార్వభౌమాధికారాన్ని కొందరు వ్యక్తులకు అప్పగిస్తారు. వారు ఆ ప్రజల తరఫున శాసనాన్ని నిర్మిస్తారు. వారే దాన్ని అమలు పరుస్తారు. ఈ ఉద్దేశ్యంతో ఎన్నికల వ్యవస్థను రూపొందించడం జరుగుతుంది. ఈ ఎన్నికల్లో తమ ధనం ద్వారా, తమ విద్య ద్వారా, తమ నేర్పు ద్వారా, తమ అబద్ధపు ప్రచారం ద్వారా ప్రజల్ని మోసపుచ్చేవారే అత్యధికంగా నెగ్గుకు వస్తారు. తిరిగి వీరు ప్రజల వోటు ద్వారా, స్వయంగా ఆ ప్రజల దైవాలయి కూర్చుంటారు, ప్రజల ప్రయోజనాల కొరకు కాకుండా, తమ సొంత ప్రయోజనాల కొరకు, వర్గ ప్రయోజనాల కొరకు శాసనాలు నిర్మిస్తారు. ప్రజలు వారికి ప్రసాదించిన ఆ "శక్తి" ద్వారానే ఆ చట్టాలను అమలుపరుస్తారు. ఈ బాధే అమెరికాలో ఉంది, ఇదే ఇంగ్లండులోనూ ఉంది. ప్రజాస్వామ్యపు స్వర్గాలుగా వర్ణించబడే దేశాలన్నింటిలోనూ ఇదే బాధ!

## ఏకపక్ష నిర్ణయం

ఈ విషయాన్ని కాస్సేపు పక్కకు నెట్టి, అక్కడ సామాన్య ప్రజల అభీష్టం మేరకే చట్టాలు చెయ్యబడతాయని

ఒప్పుకున్నా అనుభవం రూఢిగా చెప్పేదేమిటంటే సామాన్య ప్రజలు కూడా స్వయంగా తమ ప్రయోజనాలేమిటో అర్థం చేసుకోలేరు. ఇది మనిషిలోని సహజమయిన బలహీనత. ఇతడు తన జీవితంలోని అనేక విషయాల్లో కొన్ని యదార్థాలను చూడగలుగుతాడు, ఇంకా కొన్నింటిని చూడలేడు. ఇతని నిర్ణయాలు సాధారణంగా ఏకపక్షమయినవయి ఉంటాయి. ఇతడు భావోద్రేకాలకు, వాంఛలకు దాసుడయిపోతాడు. కేవలం బుద్ధి జ్ఞానాల ఆధారంగా శాస్త్రీయమయిన, నిష్పాక్షికమయిన అభిప్రాయానికి రావడం అతనివల్ల జరిగే పని కాదు. పైగా కొన్ని పర్యాయాలయితే హేతువు విజ్ఞానాల ద్వారా అతనికి భావ్యమయినదని తేటతెల్లమయిన విషయాన్నే అతడు తన భావోద్రేకాల దృష్ట్యా తృణీకరిస్తాడు.

దీనికి సంబంధించిన అనేక తార్కాణాలువున్నాయి. అయితే చర్చను పొడిగించకుండా కేవలం అమెరికాలో మద్య నిషేధానికి సంబంధించిన చట్టాన్ని మాత్రమే ఉదాహరణగా ప్రస్తావిస్తాను. వైజ్ఞానికంగాను, హేతుబద్ధంగాను, మద్యపానం ఆరోగ్యానికి హానికరమన్న విషయం నిర్ధారితమయినదే. అది మనిషి బుద్ధిపై, మానసిక శక్తులపై చెడు ప్రభావాన్ని తెస్తుందన్న విషయంలో, మానవ నాగరికతకు అది ఉపద్రవాన్ని తెస్తుందన్న యదార్థం పట్ల కూడా భిన్నాభిప్రాయాలు లేవు.

ఈ యదార్థాల దృష్ట్యా, వీటిని అంగీకరించే అమెరికా ప్రజాభిప్రాయం మద్యనిషేదం చట్టాన్ని చెయ్యాలన్న నిర్ణయానికి వచ్చింది. తదనుగుణంగా ప్రజా ఓటు బలంతోనే ఆ

చట్టాన్ని పాస్ చేశారు. కాని దాన్ని అమలుజరిపినప్పుడు ఏ ప్రజలయితే తమ ఓటు ద్వారా ఆ చట్టాన్ని పాస్ చేశారో వారే దానికి ప్రతికూలంగా తిరగబడ్డారు. దారుణాతి దారుణమయిన సారా పానీయాలు అక్రమంగా తయారుచేసి తాగారు. మునుపటికన్నా ఎన్నో రెట్లు అధికంగా సారాయి వాడారు ప్రజలు. నేరాలు పెరిగాయి. చివరికి ఏ ప్రజల ఓట్ల ఆధారంగా సారాయిని నిషేధించడం జరిగిందో ఆ ఓట్ల ద్వారానే అది చట్టసమ్మతంగా నిర్ణయించడమూ జరిగింది.

## మనోకాంక్షలే దైవం

నిషేధాజ్ఞలు అనుమతిగా మారడానికి కారణం, ఇప్పుడు సారాయి పుచ్చుకోవడం వైజ్ఞానికంగాను, హేతుబద్ధంగాను ప్రయోజనకరమయిందిగా రుజువుకావడం కాదు; కేవలం ప్రజలు తమ అజ్ఞానపు వాంఛలకు దాసులవడం ఒక్కటే దానికి అసలు కారణం. వారు తమ "సార్వభౌమాధికారాన్ని" తమ మనస్సులోని షైతాన్‌కి అప్పజెప్పారు. తమ వాంఛలనే తమ "ప్రభువు"గా తమ "దైవం"గా చేసుకున్నారు. ఈ "దైవం" యొక్క దాస్యంలోనే వారు ఆ చట్టాన్ని మార్చటానికి పట్టుబట్టారు— వాస్తవానికి, స్వయంగా వారే దాన్ని వైజ్ఞానికంగాను, హేతుబద్ధంగాను సరయినదని ఒప్పుకున్నారన్నమాట!

ఇలాంటి అనుభవాలు అనేకమున్నాయి. వీటి వల్ల ద్యోతకమయ్యేదేమిటంటే స్వయంగా మనిషికి కావలసిన "శాసన

కర్త" (Legislator)గా రూపొందే అర్హత పూర్తిగా మనిషికి లేదు. ఒకవేళ అతనికి "ఇతర దైవాల" దాస్యం నుండి విముక్తి లభించినా అతడు తన అజ్ఞానపు వాంఛలకు దాసుడయి పోతాడు. తన మనసులోని షైతాన్‌ను తన ప్రభువుగా చేసుకుంటాడు అందువల్ల అతని ఈ స్వేచ్ఛపై కేవలం అతని శ్రేయోభిలాష దృష్ట్యానే సముచితమయిన పరిధిలు నిర్ణయించడం అనివార్యం, అత్యవశ్యం కూడా.

## పరిధులు

ఈ కారణం చేతనే అల్లాహ్ కొన్ని హద్దుల్ని, పరిమితుల్ని తన దాసులయిన మానవులపై విధించాడు. వాటిని ఇస్లామీయ పరిభాషలో "హుదూదుల్లాహ్" (దైవ పరిమితులు - Devine Limits) అనంటారు. ఈ పరిమితులు జీవితపు ప్రతి రంగంలోనూ కొన్ని సూత్రాలు, కొన్ని నియమాలు. కొన్ని ఖచ్చితమయిన ఆదేశాల రూపంలో వున్నాయి. ఇవి ఆ రంగంలో సమతూకాన్ని మధ్యేమార్గాన్ని పరిరక్షించడానికి ఏర్పరచబడ్డాయి వీటి ఉద్దేశ్యం ఏమిటంటే మనిషికి ఇవి "నీ స్వేచ్ఛకు చివరి అంచులు, వీటి పరిధిలో ఏలుబడిచేసుకుంటూనే నీవు నీ ఆచరణ కొరకు ఉపనియమాలు, నిబంధనలు (Regulations) చేసుకోవాలి, కాని ఈ పరిమితుల్ని జవదాటే అనుమతి నీకు లేదు. వీటిని ఉల్లంఘించావా నీ జీవన వ్యవస్థ అపసవ్యమయి ఛిన్నాభిన్నమయిపోతుంది.

# వీటి లక్ష్యం

ఉదాహరణకు మానవుని ఆర్థిక జీవితాన్నే తీసుకోండి. ఇందులో అల్లాహ్ మనుషులకు వ్యక్తిగతమైన ఆస్తి హక్కును, జకాత్ విధిని, వడ్డీ నిషేధాన్ని, జూదం, లాటరీల నిషేధాన్ని సూచించాడు. వారసత్వపు చట్టం, ధన సంపాదనా వ్యయాలకు సంబంధించిన నియమనిబంధనలు నిర్ణయించి కొన్ని సరిహద్దు చిహ్నాలు సూచించాడు. అయితే మనిషి ఈ సూచనల్ని ఉల్లంఘించకుండా వాటిలోనుంటూ తన వ్యవహారాలను చక్క దిద్దుకుంటే ఒక వైపున వ్యక్తిగత స్వేచ్ఛ (Personal liberty) కూడా సురక్షితంగా వుంటుంది. రెండో వైపు దౌర్జన్యపరత్వపు పెట్టుబడిదారీ వ్యవస్థ నుండి ప్రారంభమయి కార్మికుల నిరంకుశత్వం వరకు పొయ్యే వర్గ పోరాటం(Class War), ఒక వర్గంపై మరో వర్గం ఆధిపత్యంలాంటి పరిస్థితి కూడా ఏర్పడదు.

ఇదే విధంగా కుటుంబ జీవితం(Family Life)లో అల్లాహ్ పరదా వ్యవస్థను, పురుషుని పెద్దరికాన్ని, భర్త, భార్య, సంతానం, తల్లిదండ్రుల హక్కులు, అధికారాలు, విధుల్ని నిర్ణయించాడు; విడాకుల చట్టాలు, బహు భార్యత్వపు అనుమతికి నిబంధించిన నియమాలు చేశాడు. వ్యభిచారం, అబద్ధపు ఆరోపణలకై శిక్షలు విధించాడు. వీటిని మనిషి సరిగ్గా పాటించి, ఈ హద్దుల్ని కాపాడుకుంటూ, వాటి పరిధి లోపల తన వ్యక్తిగత జీవితాన్ని పటిష్టం చేసుకుంటే ఇండ్లు అన్యాయం, అత్యాచారాల నరకకూపాలయ్యేవి కావు. ఇంకా నేడు మానవ సభ్యతాసంస్కృతుల మనుగడకు సవాలుగా తలెత్తుతున్న

మహిళా స్వేచ్ఛ పేరిట లేచే పైశాచిక తుఫాను కూడా ఇండ్లను నుండి చెలరేగేది కాదు.

ఇదే విధంగా మానవ నాగరికత, సామాజిక వ్యవస్థల్ని పరిరక్షించడానికి అల్లాహ్ "ఖిసాస్" (రక్త పరిహారం) చట్టం, దొంగతనానికి చేతులు నరికే శిక్ష, మద్యపాన నిషేధం, శారీరక ఆచ్ఛాదన పరిమితులు, ఇంకా ఇలాంటి కొన్ని శాశ్వత నియమాలు నియమించి ఉపద్రవాన్ని తెచ్చే ద్వారాలు చిర కాలానిగ్గాను మూసివేశాడు.

## శ్రేయస్కర మార్గం

దైవం నిర్ణయించిన హద్దుల జాబితా ఒకదాన్ని తీసుకుని, మానవ జీవితంలో సమతూకాన్ని సమంజసతను నెలకొల్పడానికి ఇందులోని ఒక్కో హద్దు ఒక్కో పరిమితి ఎంత అవసరమో విప రంగా చూపెట్టే అవకాశం ప్రస్తుతం లేదు. ఇప్పుడు చెప్ప దలచుకున్నదల్లా ఒక్కటే. అల్లాహ్ ఈ విధంగా శాశ్వత ప్రాతి పదికపై ఎన్నటికీ మార్పు చెయ్యడానికి, తారుమారు చెయ్య డానికి వీలులేని జీవిత సంవిధానాన్ని (Constitution) తయారు చేసి మానవులకు ప్రసాదించాడు. ఇది మనిషి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను హరించకుండా, బుద్ధివివేకాలను స్తంభింప జెయ్యకుండా, మానవుని కొరకు విస్పష్టమయిన, పరిశుభ్రమైన, ఓ ఋజు మార్గాన్ని నిర్ణయిస్తుంది— దీనిద్వారా మనిషి తన అజ్ఞానం, తన బలహీనతల వల్ల వినాశకరమయిన పద్మ వ్యూహాల్లో పడి మార్గవిహీనుడు కాకుండా ఉండాలని, ఇతని

శక్తిసామర్థ్యాలు తప్పుడు మార్గాల్లో వ్యర్థమవరాదని అతడు నిజ శ్రేయం, సాఫల్యం, ప్రగతుల మార్గాన నేరుగా పురోగమించ గలగాలని.

మీరెప్పుడైనా పర్వత ప్రాంతాలను చూచి ఉన్నట్లయితే గమనించే ఉంటారు. వంకరటింకర పర్వత మార్గాల్లో ఒక వైపున లోతయిన లోయల అగాధాలుంటే మరోవైపున ఎత్తయిన కొండరాళ్ళుంటాయి. రోడ్డు అంచున "అవరోధాలు" అనిపించే వాటిని నిలబెట్టి ప్రయాణీకుడు పొరపాటున లోయలో పడి పోకుండా కాపాడటం జరుగుతుంది. ఈ అవరోధాలు దేనికి? ప్రయాణీకుడి స్వేచ్ఛకు అటంకం కలిగించడం వీటి ఉద్దేశ్యమా? కాదు. అతని వినాశాన్నుండి కాపాడటమే ఉద్దేశ్యం. ప్రతి మలుపులో, మార్గం చిక్కుపడిన ప్రతిచోట, ప్రమాదం సంభ వించగల ప్రతి సందర్భంలో అతనికి "నీ మార్గం అటు కాదు, ఇటు. నీవు ఆ వైపుకు కాదు, ఈ వైపుకు మరలాలి. అప్పుడే నీవు క్షేమంగా నీ గమ్యాన్ని చేరుకోగలవు'' అని హెచ్చరించ డమే దాని ఉద్దేశ్యం. దైవం మానవులకు తాను చూపే జీవిత సంవిధానంలో నిర్ణయించిన హద్దులు, పరిమితుల ఉద్దేశ్యం కూడా ఇదే. ఈ హద్దులు మానవుని కొరకు జీవన ప్రయాణపు సరయిన దిశను నిర్ణయిస్తాయి. ప్రతి చిక్కులో, ప్రతి మలుపులో, ప్రతి కూడలిలో శ్రేయస్కర మార్గం ఇటు వైపున ఉందని నీవు ఆ దిశకు కాదు, ఈ దిశలో ముందుకు సాగి పోవాలని సూచిస్తాయి.

పైన పేర్కొన్నట్లు దైవం నియమించిన ఈ సంవిధానం మార్పులు చేర్పులు చెయ్యడానికి అలివికానిది. మీరు కోరు

కున్నట్లయితే టర్కీ (ముస్తఫా కమాల్)లాగా ఈరాన్ (రజా షా పహెల్వీ)లాగా ఈ సంవిధానానికి వ్యతిరేకంగా తిరుగుబాటు చెయ్యగలరు. కాని దాన్ని మాత్రం మార్చలేదు. ఇది ప్రళయం వరకు అఖండనీయమయిన సంవిధానం, ఇస్లామీయ రాజ్యమంటూ ఏర్పడినప్పుడు ఈ సంవిధానం ప్రకారమే అది రూపొందుతుంది. దివ్య ఖుర్ఆన్, మహాప్రవక్త సంప్రదాయాలు ప్రపంచంలో ఉన్నంత కాలం ఈ సంవిధానంలోని ఓ అధికరణాన్ని కూడా ఎవరూ మార్చలేరు. ముస్లిమ్‌గా ఉండ గోరిన వ్యక్తి దాన్ని పాటించడం అనివార్యం.

## ఇస్లామీయ రాజ్యం

ఈ సంవిధానం పరిమితుల్లో ఏర్పడే రాజ్యం కొరకు ఓ లక్ష్యం కూడా దైవం నిర్ణయించాడు. దాన్ని దివ్య ఖుర్ఆన్‌లో పలుచోట్ల విశదీకరించడం కూడా జరిగింది.

"మేము మా ప్రవక్తలను ప్రస్ఫుటమయిన నిదర్శనాలతోను మార్గదర్శక ప్రబోధాలతోనూ పంపాము. వారితోపాటు గ్రంథాన్ని తులమానాన్నీ అవతరింపజేశాము— ప్రజలు న్యాయవంతంగా నిలబడగలగాలని. ఇంకా మేము ఇనుమును అవతరింపజేశాము. ఇందులో మహత్తరమయిన శక్తి ఉంది, ప్రజలకు ప్రయోజనాలున్నాయి." (57 : 25)

ఈ ఆయత్‌లో "ఇనుము" అన్నదానికి రాజకీయ శక్తి (లేక ప్రాబల్యాత్మక శక్తి) అని భావం. ఇందులో సూచించిన

ప్రవక్తల ధ్యేయం ఏమిటంటే, దైవం వారికి తన స్పష్టమయిన ప్రబోధాల ద్వారా తన గ్రంథం ద్వారా ఏ "తులమానాన్ని" వారికి ప్రసాదించాడో దాని ప్రకారం, అంటే సరిగ్గా సమతూకంగల (Well balanced) ఏ జీవన వ్యవస్థను వారికి సూచించాడో దాని ప్రకారం, సామాజిక న్యాయాన్ని (Social Justice) నెలకొల్పాలి. మరో చోట ఇలా బోధించడం జరిగింది :

"(విశ్వసించిన) వారెవరంటే, వీరికి మేము భువిలో స్థిరత్వాన్నీ, ప్రభుత్వాన్నీ ప్రసాదిస్తే వారు నమాజ్ వ్యవస్థను నెలకొల్పుతారు జకాత్‌ను చెల్లిస్తారు— మంచిని ఆదేశిస్తారు. చెడు నుండి ప్రజల్ని వారిస్తారు." (22 : 41)

మరోచోట :

"మీరు. మానవాళి కొరకు ప్రభవింపజెయ్యబడిన ఉత్తమ వర్గం. మీరు మంచిని ఆదేశిస్తారు. చెడును నిరోధిస్తారు, దైవాన్ని విశ్వసిస్తారు" (3 : 110)

ఈ ఆయత్‌లను గమనిస్తే స్పష్టమయ్యేదేమిటంటే, దివ్య ఖుర్ఆన్ ఏ రాజ్యస్వరూపాన్ని సూచిస్తుందో దాని లక్ష్యం కేవలం విలోమమయింది (Negative) కాదు. దానికి అనులోమమయిన (Positive) లక్ష్యం వుంది. ప్రజలు ఒకరిపై నొకరు అత్యాచారం చేసుకోవడం నుండి ఆపడం, వారి స్వేచ్ఛ స్వాతంత్ర్యాలను కాపాడటం, దేశాన్ని విదేశీదాడుల నుండి రక్షించడం మాత్రమే దాని ఉద్దేశ్యాలు కావు నిజానికి సామాజిక న్యాయానికి సంబంధించిన సమతూలనంగల ఏ

వ్యవస్థనయితే దైవ గ్రంథం సూచిస్తుందో దాన్ని నెలకొల్పడం: దైవం తన స్పష్టమయిన ప్రబోధాల్లో పేర్కొన్న చెడు యొక్క సకల రూపాలను రూపుమాపడం, మంచికి సంబంధించిన విధానాలన్నింటినీ నెలకొల్పడం దాని లక్ష్యం. ఈ కార్యంలో సమయానుకూలంగా రాజకీయ శక్తిని సయితం వినియోగించడం జరుగుతుంది. ప్రచార ప్రబోధాలను కూడా అవలంబించడం జరుగుతుంది. బోధన శిక్షణల మార్గాలను సయితం అనుసరించడం జరుగుతుంది. సామూహిక ప్రభావం మరియు ప్రజాభిప్రాయాల ఒత్తిడిని వినియోగించడం కూడా జరుగుతుంది.

## సర్వతోముఖమయిన పరిపాలన

ఇలాంటి రాజ్యం తన కార్యపరిధిని పరిమితం చేసుకోవడం సాధ్యపడదు. ఇది సర్వతోముఖమయిన రాజ్యాధికారం. దీని కార్యపరిధి మానవ జీవితం మొత్తాన ఆవరించి ఉంటుంది. ఇది నాగరికతకు చెందిన ప్రతి విభాగాన్ని తన ప్రత్యేక నైతిక దృక్పథం, తన ప్రత్యేక సంస్కరణా కార్యక్రమం ప్రకారం మలచాలని అభిలషిస్తుంది. దీని సమక్షంలో ఏ వ్యక్తీ తన ఏ వ్యవహారాన్నీ తన వ్యక్తిగత (Private) విషయమని చెప్పలేడు. ఈ విధంగా ఈ రాజ్యం కొంత వరకు కమ్యూనిస్టు ప్రభుత్వాలతో పోలిక కలిగివుంటుంది. అయితే కాస్త వివరంగా పరికిస్తే దీని ఏకాధిపత్యంలో నేటి ఏకాధిపత్య Totalitarian, నియంతృత్వ Authoritarian ప్రభుత్వాల రంగు మాటవరసకయినా లేదు, ఇందులో వ్యక్తి

స్వేచ్ఛ హరించబడదు. ఇందులో నిరంకుశత్వమూ Dictator-ship లేదు. ఇస్లామీయ ప్రభుత్వ వ్యవస్థలో ఏర్పరచబడిన పరిపూర్ణమయిన సమతూకాన్ని, సమతను, సత్యాసత్యాలమధ్య గసిన అతి నాజూకు పరిహద్దుల్ని చూచి బుద్ధిగల ఏ వ్యక్తి అయినా అలాంటి మధ్యస్థ వ్యవస్థను వాస్తవానికి. సర్వో పరిజ్ఞాని, అపూర్వ వివేచనపరుడయిన దైవం మాత్రమే తయారు చెయ్యగలడని సాక్ష్యం పలుకుతాడు.

## సైద్ధాంతిక పార్టీ రాజ్యం

ఇస్లామీయ రాజ్యం యొక్క సంవిధానాన్ని, దాని లక్ష్యాన్ని దాని సంస్కరణాత్మక స్వరూపాన్ని పరిశీలించిన తరువాత విశదమయ్యే మరో విషయం ఏమిటంటే, ఈ ప్రభుత్వాన్ని నడపగలగటం అనేది కేవలం దీని సంవిధానాన్ని విశ్వసించేవారు. అది సూచించే లక్ష్యాన్ని తమ జీవిత లక్ష్యంగా భావించిన వారివల్లనే సాధ్యం. ఇంకావారు, అది ప్రతిపాదించిన సంస్కరణా కార్యక్రమాన్ని పూర్తిగా ఒప్పుకోవడమే కాక, అందులో గట్టి నమ్మకం కలిగివుండటమే కాక, దాని ఉద్దేశాన్ని దాని వివరాలను బాగా ఆకళింపు చేసుకున్నవారయి ఉండాలి అన్న విషయమూ ద్యోతకమవుతుంది.

ఈ సందర్భంలో ఇస్లాం ఎలాంటి భౌగోళికమయిన, వర్ణపరమయిన, భాషాపరమయిన షరతును పెట్టలేదు, అది మానవులందరి సమక్షంలో తన సంవిధానాన్ని, తన ధ్యేయాన్ని తన సంస్కరణా కార్యక్రమాన్నీ సమర్పిస్తుంది. దీన్ని ఎవరు

స్వీకరించినా— వారు ఏ వంశం, ఏ దేశం, ఏ జాతికి చెందిన వారయినా సరే— వారు ఈ రాజ్యాన్ని నడపడానికి ఉనికిలోకి వచ్చిన పార్టీలో చేరిపోవచ్చు. కాని ఎవరయితే దాన్ని స్వీకరించిరో అలాంటి వారు ఈ రాజ్యపుకార్యకలాపాల్లో జోక్యం చేసుకోలేరు. అలాంటివారు రాజ్యంలో జిమ్మీలు Subjectsగా మాత్రం నివసించగలరు.

అలాంటివారి కొరకు ఇస్లామీయ శాసనాంగంలో నిర్ణీత హక్కులు, రాయితీలున్నాయి. ఇలాంటివారి ధన మాన ప్రాణాల రక్షణకు అన్ని ఏర్పాట్లూ చెయ్యబడతాయి. అయితే ఇంతకు ప్రభుత్వ నిర్వహణలో వారికి భాగస్వామ్య స్థాయిని మాత్రం ఇవ్వడం జరగదు. ఎందూవల్లనంటే ఇది ఓ ప్రత్యేక దృక్పథంగల పార్టీకి సంబంధించిన రాజ్యం. ఈ సందర్భంలోనూ ఇస్లామీయ రాజ్యం మరియు కమ్యూనిస్టు రాజ్యంలో కొంత సారూప్యత గోచరిస్తుంది. కాని ఇతర దృక్పథాలుగల వారిపట్ల కమ్యూనిస్టు ప్రభుత్వం వ్యవహరించే తీరుకు ఇస్లామీయ ప్రభుత్వం అవలంబించే వైఖరికీ ఏ మాత్రం పొంతన లేదు.

కమ్యూనిస్టు ప్రభుత్వం మాదిరిగా అధిక్యత, అధికారాలు ప్రాప్తంకాగానే తన సంస్కృతీ నాగరికతల సిద్ధాంతాలను ఇతరులపై బలవంతాన రుద్దే విధానం ఇస్లాంలో లేదు. ఆస్తులు జప్తు చేసుకుని, రక్తపుటేరులు ప్రవహింపజేసి, వేలాది, లక్షలాది మనుషుల్ని పట్టి భూలోక నరకమయిన సైబీరియా వైపుకు మూటకట్టి పంపే విధానం ఇక్కడ కానరాదు.

ముస్లిమేతరుల కొరకు ఇస్లాం తన రాజ్య పరిధిలో అవ లంబించిన ఉదార వైఖరి అపూర్వమయినది. ఈ సందర్భంలో న్యాయాన్యాయాల మధ్య, సత్యాసత్యాల మధ్య విచక్షణ రేఖను ఇస్లాం సూచించిన తీరును గమనిస్తే న్యాయశీలుడయిన ఏ వ్యక్తి అయినా ఒక్క చూపులోనే గ్రహించగలడు— దైవం పంపగా వచ్చిన సంస్కర్తలు ఏ విధంగా కృషి చేస్తారో, వారి పనిచేసే తీరు ఏదో, తామయి సంస్కర్తలుగా భువిలో నిలిచే కృత్రిమ సంస్కర్తల పని తీరు ఎలా వుంటుందో ప్రస్ఫుటంగా బోధ పడుతుంది.

## ప్రాతినిధ్యపు సిద్ధాంతం

ఇప్పుడు ఇస్లామీయ రాజ్య నిర్మాణం, దాని నిర్మాణ విధానాన్ని కాస్త వివరిస్తాను. ఇస్లాంలో అసలు అధికారం చెందుతుందని ముందే తెలుపడం జరిగింది. ఈ మౌలిక సూత్రాన్ని గుర్తుంచుకుని, ప్రపంచంలో దేవుని శాసనాన్ని అమలుజరపడానికి లేచినవారి స్థితి ఎలాంటిదయి వుండాలన్న ప్రశ్నను పరిశీలిస్తే ఆ వ్యక్తులు నిజ అధికారికి ఉప అధికారు లుగా ఉండాలని మన మస్తిష్కమే ఎలుగెత్తి పలుకుతుంది. ఇస్లాం వారికి సరిగ్గా ఈ స్థానమే ఇచ్చింది. దివ్య ఖుర్ఆన్ అంటుంది :

"మీలో విశ్వసించినవారు, మంచి పనులు చేసే వారైన వ్యక్తులతో అల్లాహ్ వాగ్దానం చేశాడు : వీరికి పూర్వపు ప్రజలను ప్రతినిధులుగా చేసినట్లే వీరినీ భువిలో ప్రతినిధులుగా చేస్తాడని"

ఈ అయత్ ఇస్లాం సూచించే రాజ్య దృక్పథాన్ని (Theory of State) స్పష్టంగా విశదీకరిస్తోంది. ఇందులో రెండు మౌలిక మయిన అంశాలున్నాయి.

మొదటి అంశం ఏమిటంటే— ఇస్లామ్, ప్రభుసత్తాకం అన్న పదానికి బదులు ప్రాతినిధ్యం (Vicegerency) అనే పదాన్ని ప్రయోగిస్తుంది. ఈ దృక్పథం ప్రకారం అధికారం, ఆధిపత్యం అల్లాహ్‌కు చెందుతుంది గనుక ఇస్లామీయ సంవిధా నం ప్రకారం ప్రపంచంలో పరిపాలనా అధికారం చేపట్టిన వాడు నిజ సార్వభౌమునికి 'ప్రతినిధి' అవడం అనివార్యం. అతడు కేవలం తనకు అప్పగించబడిన అధికారాలను (Delegated Powers) మాత్రమే వినియోగించుకోడానికి అధికారం కలిగి వుంటాడు.

రెండో ముఖ్యమయిన విషయం ఏమిటంటే ఈ అయత్‌లో 'ప్రతినిధి'గా నియమించే వాగ్దానం విశ్వసించినవారందరితోనూ చెయ్యడం జరిగింది— వీరిలో నుండి ఏ ఒక్కరికో లేక ఏ కొందరికో ప్రతినిధిగా చేసే వాగ్దానం జరగలేదు. దీనివల్ల తేలేదేమంటే విశ్వసించినవారంతా ఈ ప్రాతినిధ్యపు సత్తాకం కలిగివున్నారు. దైవం తరఫున విశ్వసించినవారికి అనుగ్ర హించబడిన ఈ ప్రాతినిధ్యం, సర్వసామాన్యమయిన ప్రాతి నిధ్యం (Popular Vicegerency). ఇది ఒక్క వ్యక్తికో లేక ఒక వంశానికో, లేక ఒక వర్ణానికో, ఒక వర్గానికో ప్రత్యేకం కాదు. ప్రతి విశ్వసించిన వ్యక్తి తన స్థానంలో దేవుని ప్రతినిధియే. ప్రతినిధి అయిన పరిస్థితిలో ఒక్కొ వ్యక్తిపై దైవం ఎదుట జవాబు చెప్పుకునే బాధ్యత వుంది.

"మీలో ప్రతి వ్యక్తి కాపలాదారుడే. అతన్ని తన కాపుదలలో వున్నవారిని గురించి అడగటం జరుగుతుంది" అన్నది మహాప్రవక్త (సఅసం) ప్రబోధించిన ప్రముఖ హదీసు. దీని దృష్ట్యా ఓ ప్రతినిధి మరో ప్రతినిధి సమక్షంలో ఏ రూపంలోనూ తక్కువవాడు కాడు.

## ఇస్లామీయ ప్రజాస్వామ్యం

ఇదీ ఇస్లామీయ ప్రజాస్వామ్యానికి అసలు ప్రాతిపదిక. ప్రజా ప్రాతినిధ్యం (**Popular Vicegerency**) యొక్క అసలు భావనలు విశ్లేషిస్తే దిగువ విషయాలు వెల్లడవుతాయి :

(1) ప్రతి వ్యక్తి ప్రతినిధి అయి, ప్రాతినిధ్యంలో సమానంగా భాగం గలవాడయి ఉండి అలాంటి వ్యక్తులతో ఏర్పడిన సమాజంలో మనుషుల్ని వర్గాలుగా విభజించడం, జన్మ రీత్యా లేదా సామాజికంగా వివక్షత చూపడం అనే విషయాలు దారి చేసుకోజాలవు. ఇందులో వ్యక్తులందరూ సమాన స్థితిగలవారయి, సమాన స్థాయిగలవారయి ఉంటారు. గొప్పదనం ఏదయినా ఉంటే అది కేవలం వ్యక్తిగత సామర్థ్యం, స్వభావ స్వరూపాల దృష్ట్యా మాత్రమే ఉంటుంది. ఈ విషయాన్నే మహాప్రవక్త (సఅసం) మాటిమాటికీ విశదంగా వివరించారు :

"ఎవరికీ ఎవరిపై ఆధిక్యత లేదు. ఒకవేళ ఏదయినా ఉందంటే అది కేవలం ధర్మజ్ఞానం, ధర్మావలంబనం, ధర్మనిష్ఠ

ఆధారంగానే ఉంటుంది. మానవులందరూ ఆదమ్ సంతతి వారే. ఆదమ్ మన్నుతో సృజించబడ్డారు. ఏ అరబ్బు వ్యక్తికయినా అరబ్బేతరునిపైగాని ; అరబ్బేతరునికి అరబ్బుపై గాని ఆధిక్యత లేదు. తెల్లవానికి నల్లవానిపైగాని, నల్లవానికి తెల్లవానిపైగాని ఆధిక్యత లేదు. ఆధిక్యత ఏదయినా ఉంటే అది కేవలం భయభక్తుల ఆధారంగానే ఉంటుంది."

మక్కా విజయం తరువాత అరేబియా అంతా ఇస్లామీయ రాజ్య పరిధిలోకి వచ్చి చేరినప్పుడు మహాప్రవక్త (సఅసం) అరేబియాలో బ్రాహ్మణత్వం చలాయించే తన సొంత కుటుంబాన్ని సంబోధించి ఇలా అన్నారు :

ఖురైష్ ప్రజల్లారా ! అల్లాహ్ మీ అజ్ఞానకాలపు అహంభావాన్ని తాతముత్తాతల పట్ల పూజాభావాన్ని దూరం చేసి వేశాడు. ప్రజల్లారా ! మీరంతా ఆదమ్ సంతానం. ఆదమ్ మన్నుతో సృజించబడ్డారు. వంశపు గర్వం నీచమయింది. అరబ్బుకు అరబ్బేతరునిపైగాని, అరబ్బేతరునికి అరబ్బుపైగాని ఎలాంటి గొప్పదనం లేదు. మీలో అత్యధికంగా భయభక్తులు గలవాడే ఆదరణీయుడు."

(2) ఇలాంటి సమాజంలో ఏ వ్యక్తికీ, వ్యక్తుల ఏ సమూహానికీ వారి పుట్టుక అయినా, లేదా సామాజిక స్థాయి (Social Status) అయినా లేదా వారి వృత్తి అయినా వారి శక్తి సామర్థ్యాల ప్రగతి వికాసాల మార్గంలో వారి వ్యక్తిత్వపు వికాసంలో అనర్హతలు (Disabilities)గా అడ్డు రారాదు. ప్రతి వ్యక్తికి సమాజంలోని ఇతర వ్యక్తుల మాదిరిగా అభివృద్ధి గడించే

సమానావకాశాలు లభించాలి. అతడూ తన శక్తిసామర్థ్యాల కనుగుణంగా వృద్ధిచెందుతూ ఇతరులూ ఇలా వృద్ధిచెందడంలో అవరోధంగా నిలువకుండా ఉండాలి, వృద్ధిపొందగలిగినంత వరకు, వృద్ధిని పొందడానికి అందరికొరకూ మార్గాలు తెరవబడి ఉండాలి. ఈ విషయం ఇస్లామీయ వ్యవస్థలో పరిపూర్ణ స్థాయిలో ఉంటుంది. లోగడ బానిసలుగా ఉన్నవారు, బానిస పుత్రులు సేనా నాయకులుగా, రాష్ట్రాల గవర్నర్లుగా నియమించ బడ్డారు. గొప్ప గొప్ప ఉన్నత వంశాల పెద్దలు వారి క్రింద పనిచేశారు, చర్మకారులు చెప్పులు కుడుతూ కుడుతూనే లేచి నాయకత్వపు పీఠాలపై ఎక్కి కూర్చున్నారు. సాలెవాళ్ళు, బట్టల వ్యాపారులు న్యాయనిర్ణేతలుగా, న్యాయాధిపతులుగా, షరీఅత్ వేత్తలుగా రూపొందారు. నేడు వారి పేర్లు ఇస్లామ్‌కు చెందిన మహనీయుల జాబితాలో ఉన్నాయి. హదీసులో ఉంది: "ఒక నీగ్రోవాడయినా మీ నాయకుడయితే అతని మాట వినండి. అతనికి విధేయత చూపండి."

(3) ఇలాంటి సమాజంలో ఒక వ్యక్తి లేక ఒక వర్గం (Group) యొక్క నియంతృత్వం ఏర్పడే అవకాశమే లేదు. ఎందువల్లనంటే ఇక్కడ ప్రతి వ్యక్తీ ప్రతినిధియే. ఏ వ్యక్తి కయినా ఏ వర్గానికయినా, సాధారణ ముస్లిముల నుండి వారి ప్రాతినిధ్యాన్ని కాజేసి తానే స్వయంగా నిరంకుశ ప్రభువుగా తయారయ్యే ఎలాంటి హక్కూ లేదు. ఇక్కడ పాలనాధికారం ఇవ్వబడిన వ్యక్తి యొక్క నిజ స్థితి ఏమిటంటే, ముస్లిందరు, శాస్త్రీయ భాషలో ప్రతినిధులందరు, తమ సంతోషంతో తమ ప్రాతినిధ్యాన్ని, నిర్వహణాలక్ష్యంతో ఆ వ్యక్తిత్వంలో కేంద్రీ

కృతం (Concentrate) చేస్తారు. అతడు ఒక వైపున దైవం సమక్షంలో బాధ్యుడయివుంటే, మరోవైపున తమ ప్రాతినిధ్యం అప్పజెప్పిన సామాన్య ప్రతినిధుల సమక్షంలోనూ జవాబు దారుడు. అతడు ఒకవేళ బాధ్యతారహితుడయిన నిరంకుశ పరిపాలకుడు (Dictator)గా మారితే అతడు ప్రతినిధి (ఖలీఫా)గా కాక నమ్మకద్రోహిగా రూపొందాడన్న మాట. ఎందుకంటే నియంతృత్వం అన్నది ప్రజాప్రాతినిధ్యానికి వ్యతిరేకం.

ఇస్లామీయ ప్రభుత్వం ఓ విధంగా ఏకసత్తాక ప్రభుత్వం అన్న విషయం, ప్రజా జీవితంలోని సకల రంగాలపై దాని పరిధి విస్తరించి ఉంది అన్న విషయమూ యదార్థమే. కాని ఈ ఏకసత్తాక, సర్వవ్యాపక గుణానికి మూలకారణం దైవ శాసనం సర్వవ్యాపకమవడమే. ఈ శాసనాన్నే ఇస్లామీయ పరిపాలకులు అమలుపరుస్తారు. జీవితపు ప్రతి రంగానికీగాను దైవం ప్రసాదించిన మార్గదర్శకత్వంపై సర్వవ్యాపక గుణంతోనే అమలుజరపడం జరుగుతుంది. ఈ మార్గదర్శకత్వాన్ని కాదని ఇస్లామీయ పాలకుడు స్వయంగా సైనిక (కట్టుదిట్టమయిన) ఆదేశాలు (Regimentation) తయారుచేసే పాలసీని అవలంబించలేడు. అతడు మనుషుల్ని, ఫలానా వృత్తి చెయ్యాలని ఫలానా వృత్తి చెయ్యరాదని బలవంతపెట్టలేడు; ఫలానా పని నేర్చుకోవచ్చని, ఫలానా పని నేర్చుకోరాదని శాసించలేడు; తమ సంతానానికి ఫలానా తీరు విద్యను గరపాలని, ఫలానా తీరు విద్య గరపరాదని ఆదేశించలేడు. రష్యాలోను, జర్మనీ ఇటలీలలోను నియంతలు తమ హస్తగతం చేసుకున్న అధికారా

లను లేక అతాతుర్క్ టర్కీలో వినియోగించిన అధికారాలను ఇస్లామ్, ఇస్లామీయ దేశాధినేత అయిన "అమీర్"కు ప్రసాదించలేదు.

పైగా ఓ ముఖ్యాంశం ఏమిటంటే, ఇస్లాంలో ప్రతి వ్యక్తి వ్యక్తిగతంగా దైవం సమక్షంలో జవాబుదారుడు (Personal responsibility) ఎలాంటిదంటే ఇందులో మరే ఇతర వ్యక్తి అతనితోపాటు సహవర్తి కాడు. అందువల్ల ఈ చట్టపు పరిధులలో అతనికి పూర్తిగా స్వేచ్ఛ అవసరం— తాను కోరిన మార్గం అవలంబించడానికి, తన ప్రవృత్తి కాంక్షించిన వైపు తన శక్తుల్ని వినియోగించి వికాసమొందడానికి. ఒకవేళ అమీర్ (పరిపాలకుడు, పరిపాలనా వ్యవస్థ) అతని మార్గంలో అవరోధాలు సృష్టిస్తే అతడే స్వయంగా దైవం సమక్షంలో పట్టుబడతాడు. అందువల్లనే మహాప్రవక్త (సఅసం) లేక సన్మార్గగాములయిన ఆయన ఖలీఫాల పరిపాలనలో సైనిక (కట్టడి చేసే) ఆదేశాలు తయారుచేసే పద్ధతి కానరాదు.

(4) ఇలాంటి సమాజంలో బుద్ధి ప్రాజ్ఞతలుగల ప్రతి ముస్లిం స్త్రీ పురుషులకు ఓటు వేసే హక్కు ఉండాలి. ఎందుకంటే అతనికి ఖిలాఫత్ (ప్రాతినిధ్యపు) హక్కు ఉంది. దైవం ఈ ప్రాతినిధ్యానికి ఏ సామర్థ్యాన్నీ లేక ఏ సంపాదననూ ప్రమాణంగా, షరతుగా నియమించలేదు. కేవలం విశ్వాసం సదాచరణనే ప్రమాణాలుగా నియమించడం జరిగింది. కనుక ఓటు వెయ్యడంలో ప్రతి ముస్లిం ఇతర ఇతర ముస్లిములతో బాటు సమాన హక్కు కలిగివుంటాడు.

(ఇ. రా సి. (4) )

# వ్యక్తి, సమాజాల మధ్య సమతూకం

ఒకవైపున ఇస్లాం ఈ విధంగా పరిపూర్ణమయిన ప్రజాస్వామ్యాన్ని స్థాపించింది. మరోవైపున సామూహిక భావనను వ్యతిరేకించే వ్యక్తి తత్వాన్ని అరికట్టేందుకు కృషిచేసింది. ఇక్కడ వ్యక్తి మరియు సమాజం— రెంటి సంబంధాన్ని ఏర్పరిచేటప్పుడు రెంటి మధ్య సమతూకాన్ని ఏర్పరచడం జరిగింది. వ్యక్తి యొక్క వ్యక్తిత్వం, కమ్యూనిజం మరియు సోషలిజంలో మాదరిగా సామాజిక వ్యవస్థలో అంతర్ధానమయిపోకుండా చూడటం జరిగింది. అలాగే వ్యక్తి తన హద్దుల్ని దాటి పాశ్చాత్య ప్రజాస్వామిక వ్యవస్థలో మాదిరిగా సమాజానికి హానికరంగా పరిణమించకుండా జాగ్రత్త వహించడం కూడా జరిగింది.

ఇస్లాం ప్రకారం సమాజం యొక్క లక్ష్యమే మనిషి జీవన లక్ష్యం— అంటే దైవశాసనాలపై అమలు జరిపించడం, తద్వారా దైవ ప్రసన్నత పొందటం పైగా ఇస్లాంలో వ్యక్తి హక్కుల్ని పూర్తిగా రక్షించడంతోపాటు అతనికి సమాజం పట్ల ప్రత్యేక విధులు కూడా విధించబడ్డాయి. ఈ విధంగా వ్యక్తితత్వం, సామూహిక తత్వాల మధ్య సామరస్యం ఏర్పడింది. ఇందులో వ్యక్తికి తన శక్తిసామర్థ్యాలను పెంపొందించుకునేందుకు అవకాశాలన్నీ దొరుకుతాయి. ఇలా వృద్ధి చెందిన వ్యక్తి తన శక్తిసామర్థ్యాల ద్వారా సామూహిక సంక్షేమంలో సయితం సహాయకుడు కాగలుగుతాడు. ఇదంతా వేరుగా ప్రత్యేకంగా చర్చించవలసిన విషయం, ఇప్పుడు

దానికి అవకాశం లేదు. ఈ విషయాన్ని ఇక్కడ ప్రస్తావించ డానికి కారణం కేవలం ఇస్లామీయ ప్రజాస్వామ్యంపట్ల జనించే అపార్థాలను తొలగించడమే.

## ఇస్లామీయ రాజ్యం : నిర్మాణం

ప్రజాప్రాతినిధ్యపు భావనను విశ్లేషించడం జరిగింది. దాన్ని దృష్టిలో ఉంచుకుని, ఇస్లామీయ రాజ్యంలో "ఇమాం" లేక 'అమీర్' లేక 'రాష్ట్రపతి' స్థానం ఏమిటో బోధపడి ఉంటుంది. సాధారణంగా ముస్లింలకు లభించి ఉన్న ప్రాతి నిధ్యపు హక్కును, దాని అధికారాలను, వారు తమలో నుండి ఓ ఉత్తమ వ్యక్తిని ఎన్నుకుని అతనికి అమానతుగా అప్పగి స్తారు. ఆ వ్యక్తిని 'ఖలీఫా'గా పిలుస్తారంటే ఆయన ఒక్కడే ఖలీఫా అని మాత్రం భావం కాదు. దాని భావమేమంటే సామాన్య ముస్లిములందరి ప్రాతినిధ్యం (ఖిలాఫత్) ఆయన వ్యక్తిత్వంలో కేంద్రీకృతమయి ఉంది అని.

ఆ ప్రభుత్వ విధానంలోని కొన్ని ప్రముఖమయిన వివ రాలను ఇప్పుడు పేర్కొంటాను, తద్వారా దాని సంక్షిప్త మయిన స్వరూపం ప్రత్యక్షమవగలదు.

1. 'అమీర్' (నాయకుడు)ని ఎన్నుకోవడం అన్నది, "మీలో ఎవరయితే అత్యధికంగా భయభక్తులు కలవాడో అతడే మీలో అత్యధికంగా ఆదరణీయుడు" అన్న సిద్ధాంతం ప్రకారం జరుగుతుంది. అంటే ఒక వ్యక్తిని ఖలీఫాగా ఎన్నుకునేటప్పుడు కేవలం అతడు విద్యావిజ్ఞానాల దృష్ట్యా, పరిపాలనా దక్షత

దృష్ట్యా ఎలాంటివాడని మాత్రమే చూడటం జరగదు. దానికి బదులుగా అతడు భయభక్తుల దృష్ట్యా విశ్వసనీయుడేనా కాదా అని అత్యధికంగా పరిశీలించడం జరుగుతుంది. అంటే ముస్లిం ప్రజాసామాన్యం ఎవరి స్వరూప స్వభావాలనయితే అత్యధికంగా విశ్వసిస్తారో అతన్నే ఈ పదవి కొరకు ఎన్నుకోవడం జరుగుతుంది. అతడు ఎన్నుకోబడిన తరువాత ఇక అన్ని పరిపాలనాధికారాలు అతనికే సంక్రమిస్తాయి. అతన్ని పూర్తిగా నమ్మడం జరుగుతుంది. అతడు దైవం మరియు దైవ సందేశహరుల శాసనాన్ని అనుసరించినంతవరకు అతని ఆజ్ఞాపనల్ని పూర్తిగా పాలించడం జరుగుతుంది

2. అమీర్ విమర్శకు అతీతుడు కాడు. ప్రతి సామాన్య మనిషి అతని ప్రజాకార్యకలాపాలనే కాదు అతని అంతరంగ, వ్యక్తిగత విషయాలను సయితం విమర్శించే హక్కును కలిగి ఉంటాడు. అతన్ని పదవీచ్యుతునిగా చెయ్యడం సాధ్యమే. చట్టం దృష్టిలో అతని స్థితి ఓ సామాన్య పౌరునిలాంటిదే. అతనికి ప్రతికూలంగా న్యాయస్థానంలో వ్యాజ్యం వెయ్యడం సాధ్యమే, అతని పట్ల న్యాయస్థానంలో ఏ విధమయిన వివక్షత, ప్రత్యేకత చూపడం జరగదు.

3. అమీర్ సదా సలహాల ద్వారానే పనులు నెరవేర్చాలి. సలహామండలి ముస్లిం ప్రజాసామాన్య విశ్వాసాన్ని చూరగొని ఉండాలి. ఈ మండలిని ముస్లిముల ఓట్ల ద్వారా ఎన్నుకోవడం కూడా షరీఅత్ సమ్మతమయిన విషయమే ఇలాంటి దృష్టాంతం సన్మార్గగాములయిన ఖలీఫాల కాలంలో

కానరాదు. అయినా ఈ పద్ధతికి షరీఅత్‌లో ఎలాంటి అవ
రోధం లేదు.

4. సాధారణంగా సలహా మండలి నిర్ణయాలు మెజారిటీ అభిప్రాయం ప్రకారం జరుగుతాయి. కాని ఇస్లాం కేవలం మెజారిటీని లేక అధిక సంఖ్యాబలాన్ని సత్యానికి ప్రమాణంగా ఒప్పుకోదు. "చెప్పు, మంచి–చెడు రెండూ సమానం కాజాలవు- చెడు అన్నది అత్యధికంగా ఉండటం నీకు ఎంతగా ఆకర్షించి నప్పటికీ !" ఇస్లాం దృష్టిలో ఒక వ్యక్తి అభిప్రాయం, మొత్తం 'మండలి' అభిప్రాయానికి భిన్నంగా ఉన్నా సత్యమయింది కావడం సంభవమే, ఇలాంటి పరిస్థితిలో ఆ అభిప్రాయాన్ని కేవలం ఓ పెద్ద గుంపు దాని వెనక లేకపోవడంచేత తిరస్కరించడానికి ఏ ఆధారమూ లేదు. కనుక అధిక సంఖ్యాకులతో ఏకీభవించడానికైనా లేక మొత్తం మండలిని వ్యతిరేకించి తన అభిప్రాయం ప్రకారమే నిర్ణయం గైకొనడానికయినా అమీర్‌కు అధికారం ఉంది. కాని ఎల్లవేళలా ప్రజా సామాన్యం గమనించేదేమంటే, తమ నాయకుడు తన ఈ విస్తృత అధికారాలను భయభక్తులతో, దైవభీతితో వినియోగిస్తున్నాడా ? లేక తన మనోకాంక్షల తృప్తికోసమా ? అన్న విషయం. అతడు మనోకాంక్షలకు దాసోహమయినట్లు ప్రజా సామాన్యం గమనిస్తే ప్రజాభిప్రాయమే అలాంటి అమీర్‌ని గద్దె దింపివెయ్యగలదు కూడా.

# రాజ్య నిర్మాణం

5. అమీర్ పదవికయినా, సలహా మండలి సభ్యత్వానికయినా లేదా మరే బాధ్యతాయుతమయిన హోదాకయినా, దాని కొరకు తనను తాను అభ్యర్థిగా ముందుంచే (ఆ హోదాను ఆశించే) వ్యక్తిని లేక మరేవిధంగానయినా దానికొరకు ప్రయత్నించే వ్యక్తిని ఎన్నుకోవడం జరగదు. ఇస్లాంలో అభ్యర్థిత్వం (Candidature) మరియు ఎన్నికల ప్రచారోద్యమంలాంటి వాటికి ఏ విధమయిన స్థానం లేదు. మహాప్రవక్త(సఅసం) స్పష్టంగా బోధించారు: హోదాను ఆశించే "అభ్యర్థి"కి ఎలాంటి పదవి నివ్వరాదని, ఇస్లామీయ ఆలోచనా విధానం ఒక్కో పదవికి ఇద్దరేసి, ముగ్గురేసి, నలుగురేసి అభ్యర్థులు నిలబడే ఆలోచనను సయితం అసహ్యించుకుంటుంది. అభ్యర్థులు పరస్పరం ఒకరిపై మరొకరు పోస్టర్ల దుమారం లేపడం, ఒకరికి వ్యతిరేకంగా మరొకరు బహిరంగ సమావేశాలు జరపడం, పత్రికా ప్రకటనలు చేసుకోవడం, ఓటర్లను పలువిధాలుగా మోసపుచ్చడం, భోజన సదుపాయాలు సంతర్పణలు జరపడం, మోటారు వాహనాలు పందేల్లో మాదిరి పరుగులెత్తడం- వీటన్నింటిలో ఏ అభ్యర్థులయితే అబద్ధాలాడటంలో, మోసం చెయ్యడంలో, ధనం క్రుమ్మరించడంలో అగ్రగణ్యులో వారు నెగ్గుకుపోవడం— ఇదంతా ఇస్లామ్ పరమ అసహ్యంగా పరిగణిస్తుంది. ఇది షైతాన్ సృష్టించిన ప్రజాస్వామ్యంలోని దౌర్జన్యపు విధానాలు, వీటిలోని ఏ విధానమయినా అత్యంత స్వల్ప పరిమాణంలోనయినా సరే ఇస్లామీయ రాజ్యంలో సంభవించినట్లయితే అలా చేసిన వ్యక్తులు "ఖిలాఫత్" యొక్క సలహా

మండలిలో సభ్యులుగా ఎన్నికయిపోవడం అలా ఉంచి ఇలాంటి వారికి న్యాయాధిపతి ఎదుట నిలబెట్టి శిక్ష ఇప్పించడం జరుగుతుంది.

6. ఇస్లామీయ సలహా మండలిలో ముఠాతత్వం ఏర్పడటానికి ఆస్కారముండదు. ప్రతి వ్యక్తి స్వతంత్ర ప్రతిపత్తి కలిగివుంటాడు. "సత్యం" అని తలచిన రీతిలో తన అభిప్రాయాన్ని వెల్లడిచేస్తాడు, మీరు ఎటువంటి పరిస్థితులలోనూ మీ పక్షానికి మద్దతునివ్వాలన్న రూలు లేదు. మీ పక్షం సత్యం, ధర్మాల ప్రకారం అనుసరిస్తున్నా అధర్మ రీతిలో వ్యవహరిస్తున్నా దాన్నే సమర్థించాలన్నదానికి అవకాశం లేదు. నేడు ఒక విషయంలో ఒకరి అభిప్రాయాన్ని మీరు సత్యమయినదిగా ధర్మమయినదిగా భావించి దాన్ని సమర్థించడం, రేపు మరో సమస్యలో అతని అభిప్రాయం మీ దృష్టిలో ధర్మసమ్మతంగా లేకపోతే దానితో విభేదించడం సంభవమే. ఇస్లాం కోరేది ఈ భావస్వాతంత్ర్యమే.

7. ఇస్లాంలో న్యాయవ్యవస్థపై పరిపాలనా వ్యవస్థ ప్రభావం పడకుండా దాన్ని పూర్తిగా స్వతంత్ర వ్యవస్థగా వ్యవస్థీకరించడం జరిగింది. దైవాదేశాలను, దేవుని శాసకాంగాన్ని ఆయన దాసులయిన మానవులపై అమలుపరచడమే న్యాయాధిపతి బాధ్యత. అతడు న్యాయపీఠంపై అమీర్ లేక ఖలీఫా యొక్క ప్రతినిధిగా కాకుండా మహోన్నత ప్రభువయిన అల్లాహ్ ప్రతినిధిగా కూర్చుంటాడు. అందువల్ల న్యాయస్థానంలో అతని సమక్షంలో స్వయంగా ఖలీఫాకు కూడా ఎలాంటి ప్రాధాన్యత ఉండదు. తమ వ్యక్తిత్వం, తమ వంశం లేక తమ

మండలిలో సభ్యులుగా ఎన్నికయిపోవడం అలా ఉంచి ఇలాంటి వారికి న్యాయాధిపతి ఎదుట నిలబెట్టి శిక్ష ఇప్పించడం జరుగుతుంది.

6. ఇస్లామీయ సలహా మండలిలో ముఠాతత్వం ఏర్పడటానికి ఆస్కారముండదు. ప్రతి వ్యక్తి స్వతంత్ర ప్రవృత్తి కలిగివుంటాడు. "సత్యం" అని తలచిన రీతిలో తన అభిప్రాయాన్ని వెల్లడిచేస్తాడు, మీరు ఎటువంటి పరిస్థితులలోనూ మీ పక్షానికి మద్దతునివ్వాలన్న రూలు లేదు. మీ పక్షం సత్యం, ధర్మాల ప్రకారం అనుసరిస్తున్నా అధర్మ రీతిలో వ్యవహరిస్తున్నా దాన్నే సమర్థించాలన్నదానికి అవకాశం లేదు. నేడు ఒక విషయంలో ఒకరి అభిప్రాయాన్ని మీరు సత్యమయినదిగా ధర్మమయినదిగా భావించి దాన్ని సమర్థించడం, రేపు మరో సమస్యలో అతని అభిప్రాయం మీ దృష్టిలో ధర్మసమ్మతంగా లేకపోతే దానితో విభేదించడం సంభవమే. ఇస్లాం కోరేది ఈ భావస్వాతంత్ర్యమే.

7. ఇస్లాంలో న్యాయవ్యవస్థపై పరిపాలనా వ్యవస్థ ప్రభావం పడకుండా దాన్ని పూర్తిగా స్వతంత్ర వ్యవస్థగా వ్యవస్థీకరించడం జరిగింది. దైవాదేశాలను, దేవుని శాసనాలను ఆయన దాసులయిన మానవులపై అమలుపరచడమే న్యాయాధిపతి బాధ్యత. అతడు న్యాయపీఠంపై అమీర్ లేక ఖలీఫా యొక్క ప్రతినిధిగా కాకుండా మహోన్నత ప్రభువయిన అల్లాహ్ ప్రతినిధిగా కూర్చుంటాడు. అందువల్ల న్యాయస్థానంలో అతని సమక్షంలో స్వయంగా ఖలీఫాకు కూడా ఎలాంటి ప్రాధాన్యత ఉండదు. తమ వ్యక్తిత్వం, తమ వంశం లేక తమ